# బాపురెడ్డి పద్యకావ్యాలు

జె. బాపురెడ్డి

జయం ప్రచురణలు
హైదరాబాదు

BAPU REDDY PADYAKAVYALU

*Collection of verses in Telugu*

*by* Dr. J. BAPU REDDY

*Third Enlarged Edition* 1986

ప్రథమ ముద్రణ : 1969
ద్వితీయ ముద్రణ : 1973
విస్తృత తృతీయ ముద్రణ : 1986





వెల : **25/-**

జయం ప్రచురణలు
ప్లాటు నెం. 10, రోడ్డు నెం. 5
జూబిలీ హిల్స్, హైదరాబాదు – 500 034

ముఖపత్ర రచన : శ్రీ మడిపడగ బలరామాచార్య

ముద్రణం :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాదు–500 029

# విషయానుక్రమణిక

# అంకితం

స్నేహ శాలి, సాహితీ శీలి

శ్రీ పి. వి. జి. కృష్ణమాచార్యులు గారికి

ఒక మంచి శబ్దమ్మునకె, ఈల పాటకే
పొంగారు నీ అంతరంగమునకు
ఒక రమ్య భావమ్మునకె, రసవాక్కుకే
తీగలు సాగు నీ రాగమునకు
ఒక హృద్య పద్యమ్మునకె, వర్ణనమునకే
సంతుష్టి నొందు నీ సహృదయతకు
ఒక భవ్య కావ్యమ్మునకె, నవ్య ఫణితికే
పరవశ మొందు నీ బాలమతికి

నా బ్రతుకు తోటలో వసంతాల లోన
విరియ బూచిన వేవేల సురభి శ్రేద్ధ
శబ్ద, భావ, పద్యముల మంజరుల, కావ్య
సంపదల నిత్తు కృష్ణమాచార్య! కొనుము!

మనసిచ్చి నీ తోడ మాటాడు వారున్న
ఎరుగ వాకలి, దప్పి ఎరుగ వీవు
స్వార్థమ్ము లేని నేస్తమ్ముల పొందులో
ఎంచ వాపద, నష్ట మెంచ వీవు
తమలమ్ము, ఆటపత్రమ్ములు ఉండెనా
కోటి సంపదలైన కోర వీవు
సరస వినోదమ్ము, శాస్త్ర విజ్ఞానమ్ము
లేనిచో జీవించలేవు నీవు

కలిసి నవ్వుచు నవ్వించ గలవు నీవు
స్నేహమే తప్ప వైరము చేయ వీవు
అట్టి నీ కన్న నా కవితాత్మ పొందు
దిట్ట ఎవ్వరు ? నవ రసరాట్టు ఎవరు ?

మనము విశాఖపట్టణములో కలిసిన
నాడె ఆత్మలు పెంచి పాడినాము
భీముని పట్నపు బీచిపై పసి పిల్ల
లట్లు ఆటలు నాడు ఆడినాము
వెన్నెల రేలలో విపిన వీధుల చింత
పల్లి కొండల కైత లల్లినాము
పోలీసు పనిమీద సోయి, నేరము వెన్క
దాగిన సత్యాలు తరచినాము

వృత్తు లేవైనను మనః ప్రవృత్తు లందు
పథము లవి వేరెయైన దృక్పథము లందు
ఒక్కటే మనము; స్నేహ పయోధిలోన
కలిసి విహరింతమా కలకాల మిత్ర !

మోవిపై చిరునవ్వు మురళీరవము కన్న
మోహనమైన దామోదరుడవు
నీలి ముంగురులేను నెమలి పింఛము కన్న
మధురోజ్జ్వలమ్మైన మాధవుడవు
చేతిలో మధుపాత్ర శ్రీచక్రమున కన్న
చిద్విలాసము చిందు శ్రీధరుడవు
తరుణ భావాలె బృందావనమ్మున కన్న
అద్భుతావహమైన అచ్యుతుడవు

పద్మనయనుడ వాజానుబాహుడవు, చ
రాచరానందకర వాక్సుధాకరుడవు
శారదా ప్రసన్నుడవు ఈ స్వాదు ఫలము
గైకొనుము కృష్ణమాచార్య ! కావ్యరమను.

విశాఖపట్టణం
9-10-1970

—బాపురెడ్డి

# పద్యానికి ప్రమాదం లేదు

మూడవ ముద్రణంతో ముస్తాబైన ఈ "పద్యకావ్యాలు" నేను మూడు దశాబ్దాలకాలంలో అలవోకగా ఆలపించిన సంప్రదాయ ఛందోబద్ధ కవితాధార. "పద్యం" అనగానే పాతచింతకాయ పచ్చడి అని ఈసడించేవారు 'గద్యకవి తోద్యమ' మానస పుత్రులు. పద్యం పాదాలు విరగగొట్టటమే, గేయం గుండెను గాయపరచడమే, వచనకవితా వైశిష్ట్యమని ప్రకటించుకున్నారు కొందరు కవులు. పద్యాన్ని పరిహరించటమే పరిహసించటమే అభ్యుదయశీల మని అపోహపడ్డ అమాయకులెందరో! అయినా పద్యానికి వేయేళ్ళ చరిత్ర ఉంది. భిన్న భిన్న భావాలను, చిత్ర చిత్ర శిల్పాలను, అనేకానేక ఛందాలను సంతరించుకున్న సజీవవేణి పద్యవాణి. పండిత పామరుల నాలుకలపై, పెల్లైల పట్టణాల వేదికలపై అకాండలాస్యం చేస్తూనే ఉన్న అసమానశక్తి శైలూష పద్యం.

అందుకే గేయాన్ని శ్రవణపేయంగా, వచనకవితను నిసర్గలయాత్మకంగా పలికించిన నేను పద్యాన్నికూడా హృద్యంగా పలికించాలనే ప్రయత్నిస్తూ వచ్చాను. ప్రణయ, ప్రగతి, ప్రణవోన్ముఖంగా సాగిపోయే నా భావధారలు–త్రయీనాదాలు నా పద్య గేయ గద్య కవితల్లో నిష్పక్షపాతంగా నినదిస్తూనే ఉన్నాయి. భావశక్తికి, రసాభివ్యక్తికి అడ్డు వచ్చేది ప్రతిభా పాండిత్యాల రాహిత్య మేకాని పద్యగేయాది ప్రక్రియలుకాదు. సృజనాత్మకత, కళాత్మకత అభ్యుదయశీలత కవితకు గీటురాయి అవుతుంది కాని ఛందో రూపము కాదు. పైగా, పద్యం తెలుగువారికి సంక్రమించిన ప్రత్యేకమైన వారసత్వం. నిజానికి పద్యఛందస్సులో కొంత ప్రవేశం ఉన్నవారే గేయాన్ని, వచన కవితను శక్తిమంతంగా వ్యక్తీకరించగలరని నా విశ్వాసం. శ్రీశ్రీ, భీమన్న, దాశరథి, శేషేంద్రశర్మ, కరుణశ్రీ, నారాయణరెడ్డి వంటి ఆధునికులైన ప్రముఖ తెలుగు కవులందరూ పద్యరచనా ప్రవీణులైనవారే. అలాంటి పద్య ప్రక్రియలో నేను ఏనాడో 1969 లో ప్రచురించిన ఈ కావ్య సంపుటి 1978 లో విస్తృత పునర్ముద్రణ పొంది మళ్ళీ ఈనాడు ఇంకా విస్తరింపబడి పునర్ముద్రణకు నోచుకోవడం నా భాగ్యంగా భావిస్తున్నాను. తెలుగు పాఠకులకు

పద్య ప్రక్రియపట్ల, నా సాహిత్యం పట్ల ఉన్న ఆదరాభిమానాలకు తార్కాణంగా గ్రహిస్తున్నాను. నన్నయ నుండి నా వరకు వన్నెలు దిద్దుకుంటున్న పద్యానికి ప్రమాదం లేదని ప్రకటిస్తున్నాను.

నేను నా గేయాలన్నింటినీ పునర్విభజించి మూడు సంపుటాలుగా ప్రచురించాను. శ్రీకారశిఖరం, నాదేశం నవ్వుతూంది, ప్రేమారామం—ప్రణవ, ప్రణయ ప్రగతి ధారాగతమైన గేయ కావ్యాలు. అలాగే నా వచన కవితలను (గద్యాలను) కూడా మూడు సంపుటాలుగా కూర్చి తీర్చి ప్రచురిస్తున్నాను. 1979లో ప్రచురించిన "అనంత సత్యాలు" ఆధ్యాత్మిక తాత్విక చింతనాపరమైన భావ శిఖరాలైతే, "మన చేతుల్లోనే ఉంది", సామాజికజీవన భావ స్రవంతిగా రూపొందింది. మరి ఎకనామిక్స్ సుందరివంటి వచనకవితా ముఖంగా వెలువడ్డ ప్రణయ ప్రసూనాలు త్వరలో ప్రత్యేక కవితా సంపుటిగా ప్రకటితం కావచ్చు. అయితే నా "పద్య కావ్యాలు", "గేయనాటికలు" త్రివిధ జీవితానుభూతుల మిశ్రమ సంపుటులుగానే ఉన్నాయి.అయినా అన్నిటిలో ఆవిష్కృతమయ్యేది అనంత జీవచైతన్యమే-అఖండ భావచైతన్యమే. శారీరక, మానసిక, ఆధ్యాత్మిక సుఖశాంతులు మానవ జీవితానందానికి పరస్పర విరుద్ధాలు కావుసరిగదా పరస్పర దోహదాలు.అలాంటి సమన్వయ సత్యదర్శనమే నా సాహిత్యాదర్శంగా భావిస్తున్నాను.

నా ఇతర రచనలవలెనే ఈ పద్యకావ్యాలను పాఠకులు ఆదరించి నన్నాశీర్వదిస్తారని ఆశిస్తున్నాను. ఆధునిక విజ్ఞాన చేతనము, అంతరిక్ష విజయకేతనము అడుగడుగున ఆవిష్కృతమైన ఈ కృతులు మానవ కుటుంబ మహాకళ్యాణానికి దోహదం చేయగలవని విశ్వసిస్తున్నాను.

ఈ పుస్తకాన్ని పునర్ముద్రిస్తున్న "జయం ప్రచురణల" సంస్థవారికి ముఖ్యంగా దాని నిర్వాహకులు శ్రీ జె. మారుతిగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ పుస్తక ప్రచురణలో నా కెంతో సహకరించిన ఆత్మీయులు ఆచార్యులు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారికి, కళాప్రపూర్ణులు మహాకవి డా॥ బోయిభీమన్న గారలకు నేనెంతో ఋణపడి ఉన్నాను. నా సాహిత్య యాత్రలో నాకు నిరంతరం

ప్రోత్సాహం ఇస్తున్న పేరుపేరున పేర్కొనలేని అనేకానేక మిత్రులకు, సాహితీ పోషకులకు నేను మౌనంగా కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను. అయితే, ఆత్మీయులు శ్రీ R. ప్రభాకరరావు I.P.S; శ్రీ G. హరిశ్చంద్రారెడ్డి వంటి సాహితీ బంధువులు అందించిన సహాయసహకారాలు మరుపురానివి. పుస్తకాన్ని ముచ్చటగా ముద్రించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వారికి, చక్కని ముఖచిత్రం గీచిన శ్రీ మడిపడగ బలరామాచార్య గారికి నా ధన్యవాదాలు. నా పద్యకవితల పట్ల తమ అమూల్యమైన ఆశీఃపూర్వక అభిప్రాయాలు వెలిబుచ్చిన పెద్దలందరికీ ముఖ్యంగా ఆచార్యులు, అసమాన శేముషీ దురంధరులు డా॥ దివాకర్ల వెంకవధానిగారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు—కొందరి అభిజ్ఞుల అభిప్రాయాలు ఈ పుస్తకంలో క్లుప్తంగా ప్రచురించబడ్డాయి.

ఈ పుస్తకాన్ని 9-10-1970నాడు నాటి ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ L. బుల్లయ్యగారి ఆధ్యక్షతలో, ఆచార్య తూమాటి దొణప్పవంటి సాహితీ మూర్తుల సమక్షంలో మిత్రులు శ్రీ పి.వి.జి. కృష్ణమాచార్యులు IPS గారికి విశాఖ పట్నంలో అంకితంచేశాను. ఆయన ఈ మధ్యే పోలీసుశాఖలో అత్యంత ఉన్నత పదవి నలంకరించి ఉద్యోగవిరమణ చేశారు. ఇప్పుడీ గ్రంథం వారికి పునరంకితం చేస్తున్నందుకు ఎంతో గర్విస్తున్నాను. మామైత్రి వలెనే ఈ పుస్తకకీర్తి కూడా దినదిన ప్రవర్థమానమౌ గాక!

రాష్ట్ర విద్యాశాఖ డైరెక్టర్ తమ L. D.is. No. 5498/CA2/70. Dt. 12-5-1970 లో, గ్రంథాలయశాఖ డైరెక్టర్ తమ సైటేషన్ నెం. 1281/CTIII/201 లో, రాష్ట్ర దేవాదాయశాఖ కమీషనర్ తమ L. Dis.No. J8/27027/70 లో ఈ పుస్తకాన్ని ఆయా గ్రంథాలయాలకోసం రెకమెండేషన్ చేసినందుకు ఈ సందర్భంలో కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను.

జె. బాపురెడ్డి

# అభిజ్ఞుల అభిప్రాయాలు

శ్రీ బాపురెడ్డి గారి రచన సర్వత్ర వారి హృదయమువలెనే ప్రసన్నమై, మధురమై చదివినకొలది చదువవలెనను నుత్కంఠను రేకెత్తించుచున్నది. పద్యము లన్నియు ధారాశుద్ధి శోభితములును భావగంభీరములునై మకరంద ప్రవాహము వలె సాగిపోవుచున్నవి. ప్రసారగుణము వారి కవితకు జీవగఱ్ఱ. వారు వాడిన పదములు కుసుమములవలె రసప్రసారకములు, కిసలయములవలె మసృణములునై రచన కసమానమైన రామణీయకమును గూర్చుచున్నవి....

డా॥ దివాకర్ల వేంకటావధాని

శైలిని గురించి చెప్పడం, భాషను గురించి పరామర్శ చెయ్యడం, ఇతర కవులతో పోల్చడం వంటివి నాకు గిట్టని విషయాలు. అయినా ఈ కావ్యం చదువు తున్నప్పుడు నీ శైలీ శైలూషీ లాస్యకళాశైవాలినీ డోలికలలో తన్మయం కాకుండా వుండలేకపోయాను !....

డా॥ బోయి భీమన్న

అనుభూతి, అభివ్యక్తి, సౌందర్యం, సందేశం అనువుగా రూపొందిన స్ఫూర్తి బాపురెడ్డి కవితామూర్తి. చెప్పదలచుకున్న దాంట్లో నిర్దిష్టత, చెప్పే విధా నంలో నిర్దుష్టత బాపురెడ్డి సాధించిన విశిష్టగుణద్వయం - పద్యంలో పలికినా, గేయంలో పాడినా భావుకత అతని జీవలక్షణం. అందుకు ఒకప్పుడు పేశల చమత్కృతి వెన్నంటివస్తుంది. ఒకప్పుడు తత్త్వావిష్కృతి లోతుల్ని తరుచు కుంటూ ఉబికొస్తుంది.........బాపురెడ్డి నిత్యోదయశీలి....

డా॥ సి. నారాయణరెడ్డి

బాపురెడ్డిగారి కవితకు నవతహాసం; రాకెట్లలాంటి చూపులు దాని విలాసం; ప్రపంచదర్శనం దాని ప్రకృతి; తత్త్వాన్వేషణం దాని తాత్పర్యం; అనంతసత్యాల ఆవిష్కరణం దాని అభినవదర్శనం అధివాస్తవికతను ఆనందం వైపు మళ్లించటమూ, సామాజిక స్పృహను సౌందర్యం వైపు నడిపించటమూ, బాపురెడ్డిగారి భావభౌతికవాదం సాగిస్తున్న సాహితీప్రస్థానం.

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

భావశైలుల పరస్పర సహకారం శ్రీ బాపురెడ్డి కలానికి పుష్కలమైనది. అవి క్రమ పరిమాణంలో పెరిగిన పటిష్ఠమైన స్తంభాలై యేతద్భవ్య కవితాలతకు అందాల పందిరి పరచి సురభిళ ప్రసవమంజరుల తారకమైనవి............ ....
కవిలోని కవితాప్రకర్షకు ఛందస్సు ఎప్పుడూ శృంఖలప్రాయం కాదనే సత్యాన్ని నిరూపిస్తాయి శ్రీ బాపురెడ్డి పద్యకావ్యాలు. కవి సమర్థుడైనపుడూ, భావం శక్తిమంతమైనపుడూ ప్రక్రియ యేదైనా పాఠకుని మెప్పించవచ్చుననే కవిగారి విశ్వాసం వారి గద్య పద్య కవితలలో ప్రత్యక్షర సార్థక్యాన్ని భజిస్తున్నది....

డా॥ వి. సీతాకళ్యాణి
( [illegible] )

కవికి నిరాశలేదు. నిరుత్సాహము లేదు. ఆశావాది కవి, సమతాభిమాని కవి. మమతా సంగుడు కవి. ఎప్పటికి సమతను మమతను కోరుతూ లోకాన్ని వాటితో ముంచెత్తుతూ, చైతన్యాన్ని ఎగురవేస్తూ ముందుకు సాగిపోతూనే ఉన్నారు శ్రీ బాపురెడ్డి గారు. సమతకు మమతకు పుట్టినిల్లు వారికవనం....

డా॥ వాసా ప్రభావతి

In fact I may say something very unconventional about Mr. Bapu Reddy poems viz., that he has succeeded in presenting rationality in poetic form and has also been able to present some of life's most mundane matters as interesting and attractive by projecting their novel and appealing angles. In fact, a good poet like a good painter and a good photographer knows from which angle his subject would look most beautiful and can project the most unnoticed and enchanting side of even the most dull and apparently ugly subject. For the fact is, as Juddu Krishnamurthy has again philosophied, there is beauty in everything. It requires the right perception and the will to notice and caputre it. And Bapu has the eye for it...............

Take for example Bapu's poem on the 'Moon' when man landed on the moon and found that it was nothing but crates and mounds and that its photographs showed it as one of the ugliest sights in the Universe. Bapu Reddy's poem set right the perspective on the beauty of the Moon. Does woman cease to be beautiful to a surgeon merely because he has seen the ugly insides of her on the operation table ? he asks...............

J. M. GIRGLANI

# కవితా ప్రస్థానము

నా ప్రత్యేకత నిత్య నూతనత, వీ
　　ణావేణు సంగీత రా
గ ప్రత్యూషము నా నివాసము, నిస
　　ర్గ స్వాదు సౌందర్య భా
వ ప్రక్షేపము నా విలాసము, జగ
　　త్స్వప్న ప్రబుద్ధాంతరి
క్ష ప్రస్థానము నా మహాశయము, న
　　క్షత్రాలు నా కావ్యముల్.

ఆదిత్యాంశువులే గణమ్ములు; సమ
　　స్తామ్నాయముల్, శాస్త్రముల్
పాదమ్ముల్; గ్రహముల్, ఉపగ్రహములే
　　ప్రాసల్, యతుల్; మానవ
ద్యో దౌత్యాశయ దివ్య దిగ్విజయ సం
　　దోహమ్ములే భావముల్;
నాదబ్రహ్మయె శైలియై వెలుగు నా
　　నక్షత్ర కావ్యాలకున్.

ఎన్ని గ్రహాలు ? తారకలు
　　ఎన్ని ? అనంతమునందు విశ్వముల్
ఉన్నవి ఎన్నియో తెలియ
　　కున్నవి; కన్నులు ఊహచేయు, లో

కన్నులు కల్గు మానవుల
        గన్న జగత్తున; కింత కాలమున్
కన్న యనేకమౌ కలలు
        కట్టెదుటన్ నిజమైన నేటికిన్.

గాలిని తేలుటే ఘనత
        గా తలపోసిన రోజు లేగె; భూ
గోళ ప్రదక్షిణమ్ము ఒక
        గోవు ప్రదక్షిణ లీల చేయగా
జాలెడి కాలమున్ గడచె;
        జాబిలి భూతలి మధ్య రాయబా
రాలు ఫలించె నేడు; కవి
        రా జయి రోదసి నేలుకొందునే.

ప్రేయసి హాసమందు, నిరు
        పేదల వేదనలందు, చిన్ని పా
పాయిల కన్నులందు, మధు
        పాయిల కమ్మనిపాటలందు, మి
త్రాయత మానసమ్ములు, వి
        హాయస వీథుల నే వెలార్చుచున్
పోయెడి భావ తారకలె
        పో కలకాలపు నాదు కావ్యముల్.

యోగమార్గమున ప్రయోగమార్గమ్మున
కాంచుచుందు దేశ కాలములను
కనులతోడ లోనికన్నులతోడను
కాంచుచుందు సత్యకాంతి లవము.

( 1969 )

# స్వప్న జగత్తు

ఈ నిరీహా సమీతి బాధా నిశా ప్ర
పంచమందు, నిరాశా పవనములందు
నలిగి ఆరెడి బ్రతుకు దివ్వెలను మాటి
మాటికిని వెల్గు మనును కమ్మనగు కలలు.

మానవుడు, పుట్టి స్వప్న బింబములనుండి
భ్రమణ మొనరించు స్వప్న గోళముల చుట్టు
వాసమైయుండు స్వప్న భవనములందు
పైనమైసాగు స్వప్న విశ్వముల చేర.

సకల సృష్టి ఏ మహనీయు స్వప్నఫలమొ ?
స్వప్నసంపద లే భావబలుని సృష్టి
యో ? కలయె నిజమగు నిజమే కలయగు
స్వప్న సత్యాలు వేదాంత సాగర మగు.

గతము కన్నట్టి స్వప్నమ్మె కాద వర్త
మానము, భవిష్యమేమొ లీలా నిగూఢ
ముగ వెలుగు వర్తమానంపు మూగకనుల
కొనలయంచున, సాంధ్య జీవనములందు.

మొగ్గ కన్నెలు తొలి వలపు కలలందు
మధుపగీతాల తేలి సంబరము మీర
ఉదయరాగ లతాంకాన నిదుర లేచి
నగువు బిగువులతో తేనె నాట్యమాడు.

శర్వరీ నీల నిద్రలో స్వాప్నికాను
ఛూతి రేఖలె మెరుపులై పూయు నేమొ ?
దిన సుహాసిని, గాఢ నిద్రను వెలుంగు
చూచి, మందస్మితోషసై లేచు నేమొ ?

కలలలో కోడె కోడి రాగల వెలుంగు
పుంతలో తానమాడి, ప్రబోధ భావ
గళము సారించి, నిదురలో గల యెదలను
మేలుకొలుపును, మేటి వైతాళికు నటు.

కూడు ఆశలు, ఆపదల్ గూడుగాను
బ్రతుకు శ్రామిక జనులు స్వప్నములలోన
హాసవాసంతలక్ష్మి తద్వాసములకు
కదలివచ్చుట చూచి, సాగెదరు ముందు.

కాటువేసిన యపు డెడబాటు పాము
ప్రణయ జీవుల వెతల మూర్ఛనలలోన
సిత కపోతములై వచ్చి సేదదీర్చు
కలల గుండెలలో ఎంత కరుణ గలదొ !

కాళిదాసుని విరహంపు కలలు, గంట
మున విజృంభించి మ్రోగె యక్షుని గళాన,
శిల్పి రస కల్పనా స్వప్న సీమలే అ
జంత ఎల్లోర గుహల వాసమ్ము చేయు.

సరస కవి భావనా స్వప్న సరసిలోన
పొంగు నవె నవాక్షర కావ్య పుష్పరుచులు
స్వప్న గంధర్వ కిన్నెర స్వాదు గీత
ముగ్ధ హృదయమ్మె సంగీతమునకు నెలవు.

శ్వేత గజసమర్పిత జలజాత సుప్ర
సన్నలా స్వప్నమును కనకున్న ఉదయ
మొందునే తల్లి గర్భమ్మునందు శాంతి
దూత అజ్ఞానజేత బుద్ధుడు జగాన.

శాస్త్రవిజ్ఞాని మస్తిష్క స్వప్రయోగ
శాలలో తేలిపోవు స్వప్నాలె, రాతి
యుగమును నడిపించెను అణుయుగమువరకు
కల్ల యనుకున్న దెల్ల సాక్షాత్కరించె.

నరుని కిల స్వప్నమే చేతనా రథమ్ము
కలల అలల జీవనకథ ఇల చరిత్ర
నరుడు స్వప్న జగమ్మునే నాడు వీడు
ఆ దినమె సర్వసృష్టికి అంతిమమ్ము.

క్రోరి క్రోరి నే స్వప్న చకోరమౌదు
స్వప్న రోదసి నౌకగా సాగిపోదు
రండి నా వెంట స్వప్న తారా వినోద
మోద గంభీర సాగరోర్ములను తేలి !

( 1956 )

# అద్వైతము

ఎద కదలించునట్టి తర
లేక్షణలన్ గురుతించి పాట పా
డెద నని, ఎక్కడో కల త
టిల్లతలన్ గని తన్మయత్వ మొం
దెద నని, నోరులేని ప్రకృ
తిన్ నుతియించెద నంచు మీరు న
న్నదయత నిందసేయకు డ
నభ్యుదయుం డని హేతుశూన్యులై.

వ్రాయగనె విలాసినులపై గేయములను
కూలిపిల్లను మరచు మూర్ఖుడనుగాను,
ప్రకృతి సౌందర్యములగూర్చి పాడగానె
మానవుని కష్ట సుఖములే మరువలేదు.

మన్నును దున్ను కర్షకకు
మారులు, ఆ గని—మిల్లు—ఫ్యాక్టరీ
మున్నగువానిలోన శ్రమ
మున్ వడపిండెడివారు, క్లార్కులౌ
అన్నయ లందరున్ ప్రజల
టంచు ఎరుంగుదు; వారి బాధ లే
మున్నవొ , వారి భావి ఎటు
లున్నదొ కూడ ఎరుంగుదున్ సఖా !

స్వార్థ సంకుచిత తత్వాలకు దూరాన
తేలియాడెడి మేఘమాల జూచి
తన తల్లియేరు ఒడిని జేరనో యన
పర్వెత్తు సెలయేటి బాల జూచి
తన క్షణ జీవితమ్మును నిశా లోకాన
వెలిగించిపోవు చంచలను జూచి
శిశిరలోకపు గుండె చివురించు పువ్వుల
నవ్వుల నవవసంతమును జూచి

ఎద కరంగ పొంగారగ కదలియాడ
కైత లల్లి పాడితి నంతెకాని, స్వార్థ
పరుడ గాలేదు, నాతోడి ప్రజల వాణి
వినక కూర్చుండినట్టి పాపియును గాను.

ఒరుల కష్టము దోచుకొంచు జీవించు దా
నవుల నుత్కృష్ట మానవుల జేయు,
స్వార్థమునకు మర్త్యజాతిని బలియిచ్చు
మారణాస్త్రములతో మంచు పేర్చు,
సుఖమును కలనైన చూడని ప్రజలకు
సుమనోజ్ఞ భావిమార్గమును చూపు,
మన సంఘ జీవితమ్మును వికారించు దు
రాచారములను చితాగ్ని ద్రోయు

నిశిత కవితలు వ్రాసెడి నేనె కరిగి
కలికి చిరునవ్వులకు భాష్యములు రచింతు
ప్రకృతి సౌందర్యములను కావ్యముల నింతు
కష్ట సుఖముల రెంట భాగమ్ముగొందు. ( 1959 )

# అనుతాపము

ఒక ప్రభాత సమీర వీచికను తేలి
వచ్చి, నా జీర్ణ జీవిత పర్ణశాల
జొచ్చి, చూచి, నిట్టూర్చి. అశ్రులకు వెదరి,
ఏల మరలి పోయెదవె ఆశా లతాంగి !

మంచువలె నున్న నన్ కదలించి, భావ
నా ప్రపంచాన దించి, ఉష్ణమ్ము నించి,
గగన మంట పొంగించి నన్ గడియలోన
నేలపై కూల్చితివి శిలవోలె బాల!

ఏ మయి పోయె నేను రచి
యించిన ఈ చిరుగాలి పైని శో
భామయ స్వర్గసీమ ? నవ
భావిక శాత్మక సౌఖ్యజీవితో
హా మధురానుభూతి ? నుడి
కందని స్వప్న జగ ద్విహారమే
దే మయి పోయె? ఇంక శమి
యింపవొ ఈ పిడుగుల్ తుపానులున్?

ఈ పూ లతల మాటునే విషసర్పాలు
పొంచి యుండుట నే గ్రహించనైతి
ఈ మృదు జలదాలనే భీషణోల్కాశ
నులు గల వంచు నే తెలియనైతి

ఈ సిత జ్యోత్స్నలోనే నీలి నీడలు
తిరిగి వేటాడు టే నెరుగనైతి
ఈ నిశ్చలాంబుధియే పొంగిపడి తాండ
వించుట నే విలోకించనైతి

అరరె ! ఈ జగజ్జీవ లాస్యమ్ములోని
మృత్యుదేవత పాదాలమీఁది విలయ
కింకిణీ క్వాణముల నాలకించనైతి
ఆశ ! నీ మీది మోహాన మోసపోతి !

ఊహల మత్తులోన యువ
తోర్వశి గానతరంగ డోలలో
నా హృదపూర్వ శిల్పికృత
నవ్య కళాంబర సౌధమందు, నా
దేహము గేహమున్ మరచి
దివ్య పథమ్ముల స్వప్న చంచలా
వాహన మెక్కు వేల, భువి
వ్రాలిపడన్ పరితాప మేలకో ?

గతకాలోగ్ర వనమ్ము దాటితిని దుః
ఖమ్ముల్ దిగఁ ద్రింగి, శా
శ్వత సౌఖ్యాలయ మీవు చేర్తు వను వి
శ్వాసమ్ముతో ; వమ్ము చే
సితి వీ నాటికి సర్వభావనలు, పై
జీవింతు నే రీతి ? కా
ల తమో గర్భమునందు భావియు కనన్
రాదాయె ఆశాంగనా !

తృప్తి బంధాల నన్ను బంధించి వైచి
విశ్వమెల్ల ప్రేమించి జీవించ నేర్చి
వాస్తవ జ్ఞాన భాస్వర పథము నడచు
టొకటె సుఖ మనిపించు, కోరికల రాణి!

(1958)

# వసంతోదయము

ఈ రసాల వృక్షాల కోయిల గళాలు
పోసిన సుగాన సుధ త్రాగివేసె నేమొ?
మండుటెండల గ్రీష్మమందు బెండు వోవ
మధువుతో పొంగు లెత్తె నామ్రఫలజాతి.

లాగెనో లేదో పసుపు చేలాలు ప్రిదుల
శిశిర దుశ్శాసనుండు గర్జించి వచ్చి,
పచ్చపచ్చని క్రొవ్వలిపమ్ము లురల
వనకుమారి వసంతయై పాడె నదిగొ
ఏ మురారి మొరాలించె నేమొ కాని.

కరుడు గట్టిన హిమశిలల్ కరిగి ఝరిగ
పారె వాసంత కోష్ణ నిశ్వాస లందు
విప్లవోషస్వినీ క్రాంతి వీక్షణాల
కరిగిపారెడు దాస్యాంధకార మట్లు.

విచ్చిన సుమాలు మధువుల వెల్లివిరిసె
భ్రమరయువకాళి ప్రణయగీతముల కరగి
హెచ్చిన వియోగబాధ నా ఎద రగుల్ప
భావకవి చేసె నన్నొక దేవి మోవి.

నాడు శిశిరాన ఓదార్చినాడు, ఏడ్చి
నాడు, కవి జీర్ణ లోకమ్ము చూడలేక ;
నేడు వాసంతమున పొంగినాడు పాడి
నాడు శుభగీతి ముందుంచినాడు నేడు.

( 1954 )

# కృతఘ్నత

సుందరాస్యము కళమాసి కంది పోవ
నుదుటి కుంకుమ ముంగురుల్ చెదరిపోవ
హతహృదయ దీన సందేశ మట్లు దుఃఖ
బాష్పములు రాల్చె దేలనో ప్రకృతిదేవి !

అరయ నీదు ఉపేక్షా స్వయంకృతాప
రాధములె నీదు శోకకారణము కాద ?
కాక ఎవరేని చింతయే లేక తన ప్ర
తుకును బహిరంగ పరచుకొందు రటె తల్లి !

ఎంత అమాయికమ్మ జన
నీ ! కనులారగ చూచుచుండియున్
వింత ప్రవర్తనాన కను
పించిన ఈవిష మాన సార్భకా
నంత హతమ్ములోని నట
నమ్ము గ్రహింపక, జాలి బూని, క
ల్పాంతక దుష్కరాలకు మ
హాబల మేల యొసంగినా వొకో ?

తెలియ దటే మదంబ, భవ
దీయ మహోజ్జ్వల జీవితమ్ములో
గల కన రాని శక్తి కళి
కల్—హృదయాలు నశించి నట్టి లో

ఘల జ్వలితాగ్ని దృక్కులకు
మోసములో పడి చూపినావు ! త
త్ఫలము విషాద బాష్పకణ
ధారలు గాక మరేమి యౌనటో !

విశ్వరహస్య విహగమ్ము పెంచి దాచి
ఇచ్చినావు జీవిత మూల్య మెరుగ నట్టి
నరుని రాతిచేతులకు, ఏనాడొ పీల్చు
అసురత దాని కోష్ణ ప్రాణానిలములు.

ఆ హిమ శైల శృంగతతి
యా, ఉరు వార్ధి తరంగ ధాటియా
వాహినులా, మరుత్తుల ప్ర
వాహములా—ఇపు డాప నోపు త
ద్ద్రోహ కరాళ కాంక్ష ? ఘన
దోర్బల సంయుత క్రాంతి శాంతి హిం
సాహవ యాత్రలన్ ? మనిషి
యాకృతి చేతనె మానవుం డటే !

ఉగ్రోగ్రమైన స్వార్థోన్మత్త నర్తకీ
విలయ నాట్యాల శిథిలముల గని
మతిహీన దుర్మార్గ కృత దానవత్వ కృ
త్యాల వెల్వడిన రక్తాల గాంచి
కుటిల మూర్ఖత్వ సంకుచితత్వ తత్వాల
కేళీ నిమిత్త శోకాలను విని
ద్రోహాన అణుశక్తి దుర్వినియోగాన
కాల్చిన ధరణి వక్షమ్ము జూచి

తత్కృత కృతఘ్నతాపరాధము గ్రహించి
నే డయిన దానవత్వము వీడి నరుడు
స్వచ్ఛ మానవతా సుధా స్నాతుడైన
మానవుడు కాక పోడులే, మాను వగపు !

అతి సూక్ష్మ పరమాణు వైన, అంతము లేని
బ్రహ్మాండమైన, చొరబడు వాడు
కుల మత జాతీయతల రాజకీయాల
ద్వేష భిత్తికల ఛేదించ లేడ ?
సెలయేటికన్న వెన్నెలకన్న విహగమ్ము
కన్న స్వేచ్ఛా విహాయస విహారి
సామ్రాజ్యవాద వలసత్వా సమానతా
బద్ధ దాస్యమ్మును బాప లేడ ?

వానరుడు, దానవుడు కాడు మానవుండు
అనెడి కీర్తిని గడియించు కొనును గాక
నీకు ఆనంద నిధులను నించుగాక
ఓ ప్రకృతి మాత ! నీకు జయోస్తు ఎపుడు.

( 1954 )

# పరీక్ష

నా నవోన్మేష యౌవ నానంద సరసి
లో జనించిన ప్రణయ సరోజములను
అమల ప్రేమాంజలి ఘటించి అర్పణమ్ము
చేయ నీ చరణాలకు—త్రోయ నేల ?

పేద నని ఎంచినావొ నన్ ప్రేమమూ ర్తి !
వెర్రి నని ఎంచినావొ తపింప జూచి ?
కాను నిర్భాగ్యుడను, వెర్రిగాను నేను
నా మనః పేటి దాచితి ప్రేమ ధనము.

జీర్ణ పర్ణకుటీర నిశీధ వాసి
నైన నేమాయనే నిర్దయాత్మురాల !
మనకొరకు శాశ్వతానంద మధుర భావ
గాన సౌధాలు నిర్మించినాను రమ్ము.

ఎద ఎద వసించి, హసియించు, ఎగసి ఎగసి,
ఇంద్రలోకాలు కూడ జయించి, మృదుల
జలదశయ్యల సౌదామినులు కొలువ సు
ఖించ నూహించి నిన్ను ప్రేమించినాను.

అచ్చర కన్నె వంచును ఉ
షాంగన వంచు, తటిల్లతాంగ వం
చెచ్చట లేని ప్రేమ ప్రక
టింప, నటింపను; అట్టి కన్య పై

ఇచ్ఛయు లేదు ; చల్లగ చ
లించెడి మానవతా లతాంకమున్
విచ్చుచు నున్న నిన్నెద జ
పింతు వరింతు, మనుష్య భామినీ!

సుందర గిరి ప్రసన్నదీ మంద మంద
గీతికారావ మలయానిలాతి శీత
కాంతిపూర్ణ ప్రశాంత వనాంతర సువి
హార మోహన స్వప్నము లవియె చాలు.

ఇంత ఏడ్పించి ప్రేమ బాహ్యాంతరముల
సంతరించితివా సుప్రశాంత హృదయ !
ఎంత రసికవు ! ఇటు పరీక్షింతు వటవె ?
కొంత తడయుము నిను పరీక్షింతు నేను.

(30-9-1954)

# రసరాగము

మలయ సమీర మన్న, మధు
    మాసము లన్న, పికమ్ము లన్న—వె
న్నెలలు, మెఱుఁగు, తారకలు
    నిర్ఝరు లన్నను తన్మయుండనై
శిలలు కరుంగు నట్లు, పెను
    చీకటు లెల్ల వెలుంగు నట్లు, నా
కలలు నిజమ్ము లౌనటుల
    గానము సేతు రసానుభూతులన్.

అందిన అందమైన సుమ
    హాసము పొందినవాడ కాన నే
అందని తారకా ద్యుతుల
    కై తపియింతును , నన్ను తన్మనో
మందిరమందు నిల్పుకొను
    మానిని రాగ మెఱింగి నందుకే
కుందుచు నుంటి నా వలపు
    కోరక నాయెద దోచు వారికై.

తారలతోన తార, మధు
    ధారలలో మధుధార, బాల శం
పా రమణీయ లాస్య సుర
    బాలలలో సుర బాల కోసమై

దారమునై అదృష్టపు ప
తంగము నింగికి లేపి, సమ్మతిన్
తీరని తీయనౌ కలల
తీరముపై విహరింప బోయెదన్.

పూవుల అంద మందరిది
పూచిన తీవ ఎవళ్ళదైన, స
ద్భావ రసమ్ము అందరిది
భావుకు డేగృహవాసియైన, గా
నావళి శ్రోత లందరిదె
ఆ ప్రియ గాయని ఏరిదైన, ఏ
లా విడలేరొ స్వార్థము అ
నంత కళావిభవమ్ము కోసమున్.

పాడెద వేయిసారు లిదె
పాటను; పాడెద లక్ష తీరులన్
వాడని భావముల్ మలచి;
పాడెద సుందరతాబ్ధిచిత్తునై;
ఆడెద కోటి భంగిమల
ఆడిన ఆటనె; ఎంత త్రాగినన్
వీడని దాహ మార్పగల
వింత రసామృత పానమత్తునై !

( 1966 )

# ఆనందయోగి

ఎవరు ఛేదించ గలరు నే నీ జగాన
కట్టుకొన్న ఆనందాల కలల కోట ?
ఎవరు వారించ గలరు నే నీ బ్రతుకును
మధుర గీతాల మాలగా మలచుకొనుట ?

ఏను వసంత వాటికకు
నేగి ప్రమోదము చెందకుండ ద్వే
షానల చిత్తు లెవ్వరో న
నడ్డెద రౌర ! ఎరుంగలేక — నా
లోనె వసంతలక్ష్మి ఎద
లోని ఎదన్‌వలె నాట్యమాడి, అ
మ్లాన మహానుభూతి సుమ
మంజరులన్ రచియించి మించుటన్ !

చల్లని సంజగాడుపుల
సాగర సైకతతీరమందు నే
నుల్లము పొంగగా తిరుగు
చుండుట ఓర్వమి త్రోసినారు, మూ
ర్ఖిల్లు పయోధిలో ఎవరో
రేయిని దాగి, గ్రహింపలేక — రం
జిల్లెద నంచు ఆ కడలి
జీవన మౌక్తిక రత్నదీపమై.

మబ్బుల మీదుగ సాగెడి భావ వి
మానములో పయనించెడి నన్
దబ్బిలి ఎవ్వడొ కూల్చగ జూచెను
దారుణ దుష్టగుణాశనియై
అబ్బుర మొందెను కుందెను నా ప్రతి
అంగము ఛత్రవిహంగమమై
కబ్బము లల్లుచు గాలిని తేలుచు
గానము చేయుట చూచి మదిన్.

కోరుకొన్న గులాబీలు కోయునపుడు
క్రూర మగు ముళ్ళు నాచేయి కొరికి, మురిసి
పడును గాని ఎరుంగవు—ప్రణయతత్వ
బోధయేగాని నా కది బాధకాదు

అష్టైశ్వర్యము లేవా నా కడకు రా
నడ్డంకులం బెట్టి పా
పిష్టుల్ నాకిల కష్టనష్టములు, దు
ర్భిక్షమ్ము కల్పింతురా!
ఇష్టమ్మైనపు డన్నమే కమికెడో
ఏ నీడయో యున్న సం
తుష్టిం జెందెడి నన్ను, స్వార్థముల వ్యా
ధుల్ బాధలం బెట్టునే?

అమృత మట్టులనే హాలహలము గ్రోలి
వెన్నెలట్టుల చీకటి కన్నె వలచి
పరవశిల్లెడి నన్ను ఎవ్వరును ఏమి
చేయగలరు? ఇక్కట్లు నన్ చేరునెట్లు?

ధ్రువముల హిమశిలలైనను
అవనీ గర్భాంత రోష్ణ మైన భరింతున్
అవమానము సమ్మానము
ఎవరే మొనరింప సత్య మేను వచింతున్.

( 1967 )

# అనింద్య

నిను విసిగించి, నీ కనుల
నిండి స్రవించు కవోష్ణ బాష్ప వా
హినులను చూచుకొంచు హసి
యించుచు, వేడుక జెంద నాకు భా
వన కల; దైన నాకములె
భవ్యములై కనిపించు నీదు చ
క్కని నును చెక్కుటద్దములు
కందు నటంచు భయమ్మగున్ ప్రియా!

ఎన్నివిధాల నన్ను హృద
యేశ్వరి! క్షోతలు పెట్టినావొ, నా
కెన్నగ సిగ్గుకల్గు అవ
హేళన లెన్ని యొనర్చినావొ, నీ
కన్నిటి కన్నిరెట్లు కతి
నాత్మత శిక్ష నొసంగ జూడ నీ
కన్నులు రువ్వు దృగ్లతలు
కట్టెడు నా కరయుగ్మమంతలో.

అర్చనము లేని నా యౌవనాలయాన
చంచలాదేహ! నిను ప్రతిష్ఠించుకొరకు
ప్రణయ గీత మంత్రా లెన్ని పాడినానొ
ఎన్ని గరళాబ్ధు లీదితి నెరుఁగ గలదె?

చుక్కల వెక్కిరించు కను
        చూపులెగాక, చివుళ్ళ మెక్కి మ
త్తెక్కిన కోకిలమ్మ నవ
        హేళన సేయు గళమ్మెగాక, నా
వాక్కుల కందరాని ఖగ
        వంతుని సృష్టికె మూలమౌ ఎదో
చక్కదనమ్ము నీ యెద ని
        జమ్ము చెలీ! కనుగొంటి నా హృదిన్.

నీ పదాబ్జాలు చేరవచ్చే పథాల
పరుగు లిడి కోటి గండాల బయట పడితి—
నా ఘనత చేత కాదు అందాల బాల!
నీ ప్రణయ మహిమవలననే ప్రియతమ!

నీ రవళించు అందియలు
        నీరసమైన మదంతరాన ఏ
వో రసవద్వసంతముల
        'కో' యని 'కూ' యని పించు శ్రావ్యశ్రృం
గార సుధార్ద్రి కావ్యముల
        కమ్మదనమ్ములతోడ పాడి, మం
దార మనోజ్ఞ భావముల
        నారులు వోయును, నాట్య సుందరీ!

నీ విషాగ్ని పరీక్షల నెగ్గినట్టి
నన్నె వరియించి, యుష్మద్ ప్రణయ సుమాల
మాల నాకె యర్పించి సౌఖ్యాల నేలు
దేవి! మేధావినివి కళాదేవి వయ్యు...

రౌద్రనిశాభ్రసైకతము
　　లన్ జడిముబ్బుల ముళ్ళకంచెలన్
నిద్ర ఎరుఁగకన్ శ్రమగ
　　ణింపక దాటుచు పర్వులెత్తు ఆ
రుద్రశిరోమణీ ప్రణయ
　　రూపి నిశాప్రియు బాధ సౌఖ్యక
ల్పద్రుమమా! గ్రహించితిని
　　పాడెడి నీ చిరునవ్వు భాషలన్.

ఈ కొరగాని లోకమున
　　ఈ క్షణికంపు సుఖాలలోన ఏ
మో కల దంచు నే భ్రమసి
　　యుంటిని ఇన్ని దినాలు, నేడు నీ
లో కనుపించు కాంతి ఝరి
　　లో కనువిప్పెను నా యెడంద, నే
నీ కను నీడలందు రమ
　　ణీ! రసలోక తపస్వి నయ్యెదన్.

పిచ్చి సరసాల నిన్ను ఏడ్పించ నెంచి
ఎదొ ఎదో అనబోయి దేవీ! త్వదీయ
ముగ్ధ లావణ్య మహిమాబ్ధి మునక లిడితి,
హాస్యమునకైన నీవు శిక్షార్హ వటవె!

(1955)

# సుప్రభాతము

సుప్రభాతము, ఓ వసంత ప్రసూన
వనములార ! ప్రాభాత శోభా ప్రదీప్త
మిత్రులార ! కళా జగచ్చైత్రులార !
ఉజ్జ్వల నవీన వర్ష మహోదయాన
సుప్రభాతము—

ఆ కుసుమిత వనవిలాసినీ కచమ్ము
వోలె నా యెద నాశా సుమాలు పూచె,
పిక లసద్గాన పులకిత ప్రకృతి భంగి
మన్మనము భావ సౌరభ మగ్నమయ్యె.

ఎన్ని వసంతముల్ గడిచె
నెన్ని ఉగాదులు వచ్చి పోవలే
దెన్నడు నాకు ఇట్లు వచి
యింపగరాని మహానుభూతి గ
ద్యోన్నతి కల్గలేదు; భర
తోదధి నాంధ్ర మహాతరంగ మి
ట్లెన్నడు అంబరోన్నతి గ
ళించుచు పొంగుచు పొర్లలేదురా !

బాల బాలికలు పుష్పాలవోలె ప్రభాత
వేళ ఆస్యాల హాసాలు నింప
ప్రతి గృహ మ్మొక పల్లవిత మహీరుహ మట్లు
పచ్చతోరణముల పరిఢవిల్ల
యువతీ యువకులు కలవిహంగముల కిల
కిల లట్లు పరిహాసములను విసర
ప్రతివాడు మలయ మారుత వీచు లట్టు లు
జ్జ్వల భావి తావి శ్వాసలు వెలార్చ

ఎటుగనిన రాగ మంగళార్భటి చెలంగ
పటుతరోత్సాహ దివ్య ప్రభలు వెలుంగ
నేడె ఊరూర వనలక్ష్మి నిల్చి యింపు
గా ఉగాది జరుపుకొను కరణి తోచు !

తెల్లని వేపపూ వొగరు
తీరిన మామిడికాయ బెల్లమున్
చల్లని నీట కల్పిన రస
మ్మును దొన్నెల నిండ త్రాగి మ
త్తిల్లి సురత్వ మొంది నవ
దివ్య వసంత కళా విలాస సం
ఫుల్ల జగత్ ప్రమోద పరి
పూరిత గీతిక లాలపింతమా !

గున్నమామిడి, తన ప్రియకోకిలమ్మ
పీడిపోయి అనాడు, తపించి, తిరిగి
నవ్యముగ నేడు కూడి గానమ్ము సేయు
నాంధ్ర తెలగాణ మేకమైనట్టి తమిని.

ఇంతటి శుభదాభ్యుదయ వసంత వాటి
నడుగిడు కతాన "దుర్ముఖి" యయ్యె సుముఖి
యే యగునురా నవీనాబ్ద మెట్టు లనిన
శుక్తిగర్భాన పడు చిన్కు ముక్త కాదె !

( ఆంధ్రప్రదేశ్ ఉదయించిన తొలి ఉగాది సందర్భంలో )

( 1956 )

# మనశ్శాంతి

ప్రేమించలేదు నిన్ ద్వేషించలేదు, అ
ట్లని తటస్థముగ నుంటి నని కాదు
నవ్వించలేదు నిన్ కవ్వించలేదు, అ
ట్లని అరసికుడ నైతి నని కాదు
రమ్మనలేదు నిన్ పొమ్మనలేదు, అ
ట్లని పల్కరించ లేదనియు కాదు
త్వర పడలేదు నే పొరపడలేదు, అ
ట్లని ఋషీశ్వరుడ నే ననియు కాదు

మన చెలిమి తీరులోని ఆ మహిమ మేమొ
వింతగా కూర్చినది మనశ్శాంతి నాకు
నీరజ దళమ్ము పై నుండు నీర మట్లు
నేను నీతోడ కూడి యున్నాను......?

( 1956 )

# సరస సాగరుడు

ఖండ ఖండాలు నీదుకైదండ లోన
నిల్పుకొన్న మహాంభుధీ! నీ గభీర
హృదయగానము వినెడి నా హృదయమందు
నవ్య భావన లేవియో నాట్య మాడు.

ఆడుకొందువు, పాట పాడుకొందువు దివా
రాత్రమ్ము లీవు వారాశి రాజ!
ఇరు సంజలును నీకు మృదు గంధవహ తాళ
వృంతాలు వీచును వీచి రాజ!
వెన్నెల కన్నె కన్పించిన చాలు, మై
మరచి నీయెద పొంగి పొరలు సౌర!
ఎటు పొరలిన మేను పొటమరించని రీతి
పరచుకొంటివి ఇసుక పరుపు చుట్టు !

ఎంత రసికుడవో నదీ కాంత లంత
దూర దూరాలనుండి నిన్ చేర వత్తు
రొక్కరికి తెలియకుండ మరొకరు! సుంద
రతకు ఆనందములకు శరధివి నీవు.

ఏ మని పాడెదోయి ? ధర
జీ పరిణామ కథా విశేషముల్
నీ మధురానుభూతులను,
నీ కలలన్ సమకూర్చి తీర్చి కో

ఖామయ గీతు లల్లుకొని
పాడెద వేమొ, అనంతకాల జీ
వామృత సాగరా! భవ ద
యంత్రిత భావ తరంగ వీణపై!

పులకరించితి వేని సజ్జల కణముల
ముక్తి పొంది యైపోవును మౌక్తికములు
రక్తి చెందెద వేని చిరత్న శిలలు
ధన్యతను చెంది కావె రత్నాల జాలు—!

నీ యుచ్ఛ్వాసములే పయోధరములై
నింగిన్, ధరా వర్షమై
ఆయా దేశ నదీ నదమ్ము లయి నీ
యం దేవిధిన్ లీనమౌ
నో యారీతి సమస్త జీవులును ఏ
దో జీవనానంద సం
శ్రేయోవిర్భవ మొంది అందె తుదకున్
లీనం బవున్, సాగరా!

( 1962 )

# రవీంద్రకవీంద్రుడు

హిమ గిరీంద్ర శిఖరి, హిందూ మహాంబుధి
గంగ, యమున, కృష్ణ కలవు మాకు
కలవు తూర్పు పడమరల కనుమలు మాకు
కవి రవీంద్ర! నీవు కలవు మాకు.

కలవు కాని నేడు కనరావు కనులకు
ఐన లేదు నీవు లేని చోటు
లోన కనులు విప్ప లోకమ్ము నిండార
కలవు నీవు, వెల్గ గలవు నీవు!

వంగమె కాదు, ఈ భరత
వర్షమె కాదు, ప్రపంచ మెల్ల ఉ
ప్పొంగెను నీయెడంద విర
బూచిన కావ్యకళా పరీమళో
త్తుంగ తరంగ డోలికల;
దుర్భర దాస్య విశీర్ణ సాహితీ
ప్రాంగణ మందు నాటితి వ
యా విలస ద్రస పారిజాతముల్!

శీతాద్రివై నీవు గీతాంజలి ఘటించి
ప్రకృతిలో లీనమై పాడు నపుడు,
విశ్వ భారతి వీణ వినిపించె నొక క్రొత్త
శ్రుతి, నవజీవన రుతి; రవీంద్ర!

దేశాల విడదీయు ద్వేషాగ్ని కుడ్యాలు
కూలె, ప్రాక్పశ్చిమాల్ కూడి పాడె
ద్యోగంగ భూగంగతో కూడి ప్రవహించె
నరునిలో దివ్య గంధములు వీచె

ప్రావృ డంభోధర రథమ్ముపై నొకపుడు
పుష్ప సురభిళ వన మార్గమున నొకపుడు
స్వామి యేతెంచి, నీ హృది ప్రేమ హస్త
ముంచి, ఆనందజలధిలో ముంచె నిన్ను.

మంజుల భారతిన్ హృదయ
మందిర మందున నిల్పి, దేవ భా
షం జెలువొందు నా ఉపని
ష న్నవసారము పండి, నీవు గీ
తాంజలి పట్టు నప్డు హృద
యాంజలి పట్టి జగజ్జనాళి భ
క్తిం జపియింపరే భరత
దేశ యశోరవి నిన్ లసత్కవీ!

సృష్టించితివి కవిస్రష్ట! 'గోరా'ను నీ
దేశభక్తికి దివ్యదీప మట్లు;
ఒక అల్పఘటన మొక్కొక్క చరిత్రకు బీజ
మిడు నని తెలుపు నీ 'పడవ మునక';
నీ లోని స్వేచ్ఛా దయా లక్ష్మి ఉప్పొంగి
పారెను నీ 'ముక్తధార'లోన;
నాట్యాభినయ కళౌన్నత్యంబు చాటింప
గల్గె నీ "నర్తనకన్య పూజ";

అమృత హృదయ ! నీ కథలు సత్యములు చాటె
నీ పవిత్రగానమ్ము వెన్నెలలు గాచె
శ్రీ రవీంద్ర కవీంద్ర ! నీ సిద్ధ వాగ్జ
నిత సరస్వతి విశ్వజనీన మయ్యె !

మంచుకొండను జూచి, మానసమ్మును పెంచి
అమృతధారగ పారినట్టి నీకు;
ఎండకాలపు గుండె ఏ మేమి వాపోవు
చుండెనో వినిపించుచుండు నీకు;
మెరపు ఖడ్గము లాగి చిరకాల దాస్య శృం
ఖలములు తెగవేయ గల్గు నీకు;
బ్రతుకు నేలను పండు లాభ ప్రమోదాలు
అనుభవించుచు ఋషియైన నీకు;

మన్ను దున్నెడి మనుజుల మధ్య ఎపుడు
దేవు డుంట గాంచిన గురుదేవ! నీకు
గురు వొకండు, బడి యొకండు ధరణి లేవు
ధాత్రి విరచిత ప్రకృతి పుస్తకము తప్ప!

నీ జన గణ మన గానము
నీ జాతికి గీత మయ్యె, నీ స్వప్నము స
ద్యోజాత సత్య మయ్యెను
మా జీవిత శరచ్చంద్రమా! కోకిలమా!

ఖండాంతరముల భారత
ఖండమున కఖండ కీర్తి గడియింప కవీ
ట్కాండమ్మున నీవె కవీం
ద్రుండ వనిరి లోక కవివరుల్ సత్యాత్మన్!

నీ గభీరానంత సుందర
తా గవేషణమున సుమించెను
ఆ యపూర్వామ్లాన తారు
ణ్యా మృతోషా బాల ఊర్వశి!

నీ దృఢోజ్జ్వల మానవత్వా
రాధనమ్మున నిల్చె "శాంతి ని
కేత" నమ్మున విశ్వ భారతి
భూతలము వెల్గన్!

సరస సాహిత్య సంస్కృతీ స్నపిత మైన
ఆంధ్ర జాతి నిన్ గుండెల కద్దు కొనుచు,
నీ కళా మందిరములను నిల్పుకొనును
అభ్యుదయ శాంతి శిఖర సమగ్రములను!

(1960)

# స్నేహ సౌరభము

ఎక్కడి దాన వీవు, మరి
యెక్కడి వాడను నేను, ఎట్టులా
చక్కని సంజ వేళ ధ్రువ
సాగర తీరము మీద ఎందుకో
చుక్కల వోలె రాలిపడి
చూచితి మొక్కర నొక్క; రూహకున్
చిక్కని స్నేహ బంధమున
చిక్కితి మొక్క క్షణమ్ము లోననే!

దాహము తీరెనా ఎదకు
తన్వి! భవద్రస వాక్కు లందు; సం
దేహము తీరె నాత్మకు ప్ర
దీప్త భవన్ముఖ హాస రేఖలన్;
మోహము లేని స్వచ్ఛ తమ
మోదము కూర్చు నిసర్గ రంజక
స్నేహము మించు భాగ్య నిధి
సృష్టిని లే దనిపించె నయ్యెడన్.

ఒకరిని చూడగానె ఎది
యో అనురాగము మోసులెత్తు, వే
రొకరిని చూచి చూడగనె
ఓర్వమి ద్వేషము పొంగులెత్తు, దే

నికి గల కారణమ్ము రమ
ణీ! కనరాదు వితర్క హేతు వా
దికి; మరి జన్మ జన్మలకు
తీరని వాసన లుండ కుండునా!

నా దేశ మీ వంక నీ దేశ మా వంక
నడుమ నున్నవి మహా జలధు లేడు
నా మతమ్మనకు నీదౌ మతమ్మనకును
వయసు భేదము వేల వత్సరాలు
కుల మున్నదను నాకు కులము లేదను నీకు
నడుమ అగాధ వర్ణవ్యవస్థ
నా రంగు నా రూపు నీ రంగు నీ రూపు
వెలుగు చీకటు లట్లు వేరు వేరు

ఇంత అంతర మున్న రవంతయైన
అడ్డు లేదయ్యె ఆత్మ సమైక్యమునకు
లౌకిక స్వార్థచింతనానేక బాహ్య
బంధనా లేల మన స్నేహ బంధమునకు?

పొదు పంది రేని లేక పారు తీవ లట్టులన్
ఆది అంత మేది లేని అంబుదాల పోలికన్
రోదసీ హృదంతరాల లోని తార లట్టులన్
నాదమట్లు వేదమట్లు నాదు నీదు స్నేహమౌ.

పాడితి వీవు నా ప్రణయ
పల్లవ బాహురసాల శాఖలన్
వీడక నిన్ను పట్టుకొన;
వేల అకాల వసంత మాధురుల్

పాడెను; శీతవాతములు
భగ్గున మండెను; ఆ దినమ్ము నే
నాడు స్మరించుకొన్న స్మృతి
నాశము మ్రోగును శబ్ద పేటియై!

నీవు పాడియు పాడించినావు నన్ను
నీవు ఆడియు ఆడించినావు నన్ను
భావములు నావి పాటలో భాష నీది
ప్రేరణము నాది నాట్యాల రీతి నీది.

వచ్చి పోవవచ్చు ప్రభువులు ప్రభుతలు
కాని—నిల్చిపోవుగా చరిత్ర
చచ్చిపోవవచ్చు సశరీర ప్రేమికుల్
చచ్చి పోదు ప్రేమ శాశ్వతమ్ము.

(1968)

# నెదరులాండ్స

ఎగసిపోయి మిన్నంట నే నెగసిపోయి
సింధువులు క్షేత్రములు గిరి శృంగములను
దాటి వ్రాలితి మంచుపూతోటలోన
రాగసాగర నవ్యతీరాల లోన—

ఎచ్చట చూచినన్ సుమము
లే సుమకోమల బాలలే సిరుల్
విచ్చిన జాడలే మధువు
వెచ్చదనమ్ములు పంచు వాడలే
పచ్చిక బీడులే ఘటని
భ స్తన గోవుల మందలే ఒహో
అచ్చెర లుండు స్వర్గ మిది
యా యనిపించెడి వింత నేలలే.

చూచితి సౌందర్యమ్ములు,
చూచితి మధురుచులు, తాకి చూచితి కౌనుల్
చూచితి నవవాసన, విని
చూచితి జీవనగళాలు, చోద్యము లెన్నో!

"సురజగత్తున ఈ బీరు దొరకబోదు
కాన మనసార త్రాగు డిక్కడనె" యంచు
కొంటెనవ్వుల గుబ్బెతల్ కొసరి కొసరి
అమ్మెదురు బారులను బీరు హైనకీను.

పని యొనరించు వేళ పౌర
పాటున సైతము విశ్రమించ, రా
పని సమయమ్ము తీరగనె
పక్షులు పోలిక స్వేచ్ఛగా గృహాం
గణములయందునో ప్రియుల
కౌగిళులందునొ పానశాలలం
దుననొ వినోద మోదముల
తో పులకింతురు కార్యముక్తులై.

భగవద్భక్తి కళానురక్తి చిర సౌ
భ్రాతృత్వ సేవా సుధా
పగలే తుంగతరంగ హస్తములు పై
పై కెత్తి గొంతెత్తి మో
క్షగవాక్షమ్ములు విప్పి పీవొ ఉపదే
శమ్మిచ్చు చున్నట్లు నా
కనిపించెన్ వినిపించె చర్చిగుడి గీ
తాలాపముల్ అచ్చటన్.

పిన్నలు పెద్దలు కన్నెలు ప్రౌఢలు
భేదము లెంచక వీధులలో
మన్ను చివుర్చగ మిన్ను గగుర్చగ
మంచు పరాగము నించుకొనన్
వెన్నెల కన్నెలు పాటలు పాడుచు
వెచ్చని నాట్యము లాడి రహో
కన్నుల చూచియు నమ్మము అచ్చటి
"కారినివాలు" మహోత్సవముల్ !

విడి విడి నాట్యముల్ సలిపి
వేసట జెంది, రణించ వాద్యముల్
తడబడ పాదముల్ ఎదలు
తత్తర మొందగ, నాట్యశాలలం
దౌడలు ఒడళ్ళు ఏకముగ
ఒక్కరి నొక్కరు కౌగలించి ప్రే
ముడి యొనరింపగా నటనముల్
యువతీ యువకుల్ ; కనన్ వలెన్ !

కాచిన ఎండలో తళుకు
కాంతులు చిందెడి స్వర్ణ రాసులో
లేచిన సాగరోర్మికల
లేచిన సుందర రత్న రాసులో
తోచదు, నగ్నగాత్ర నవ
తోరణ పంక్తులు కట్టి సొంపుగా
బీచులు సల్పునేమొ కన్ను
విందుగ గ్రీష్మమహోత్సవమ్ములన్.

ముద్దులుగార, జార జన
మోహన నగ్నవయో విలాసముల్
అద్దపు శాలలన్ మెరయ,
అత్తరు లత్తుక కాటుకల్ ఎవో
అద్దిన అందముల్ మరుని
అమ్ములుగా అనిసల్పు కామపున్
విద్దెల వీరవేశ్య లట వింతల
కే గిలిగింత లయ్యెడిన్ !

"రంబ్రాంటు" తైల చిత్రాల శాలలను, "మ
స్తాఖు"లో కుడ్యచిత్రాలు చూడు
మంచి కంజలిపట్టు కంచు విగ్రహములు
"జగతి న్యాయస్థాన" శాంతిమహలు
బృందావనమునకే విందౌ కు కెన్‌హాపు
యమున బోలిన రైను రమణి చూడు
ఆలమందలు చూడు అభిసారికల చూడు
పాడి పంటలు వన ప్రకృతి చూడు

చూడు "రాటరడాము" లో ఓడరేవు,
"స్ఖేవినంగను" లోని విచిత్రములను,
మేడలను చూడు, వజ్రాలవాడ చూడు,
గాలిచక్రాల డైకులలీల చూడు !

ఏగుము ఒక్కసారయిన
హేగు మహానగరమ్ము చూడగా
ఏగుము ఇంద్రభోగముల
నేలెడి ఆంస్టరడాము చూడ, త
త్సాగర తీర రమ్య సుమ
సాగర డోలల తేలిపోవుచున్
సాగుము డచ్చి వీరులు స్వ
శక్తి సృజించిన దేశమున్ కనన్.

( 1968 )

# నెహ్రూజీ

( 27-5-1964 నాటి వేదనా తరంగము )

రాలిపోయెను విశ్వంభరా కిరీట
రమ్య నవ జీవన చ్ఛటా రత్న మొకటి
తడిసిపోయెను మానవతా కవోష్ణ
బాష్పములలోన నేడు నా భరతభూమి.

శాంతికి చిహ్నమై భరత
జాతికి జీవన దాతయై జగ
త్క్రాంతికి హేతువై నవ శ
కమ్మును నిల్పిన దివ్యభావనా
స్వాంతుడు ధర్మపాలకుడు
పండిత జవ్హారులాలు — నేడు లో
కాంతర వాసి యయ్యె జగ
మంత విషాద విశీర్ణమయ్యెగా!

భిన్న మత భిన్న భాషా విభిన్న సంస్కృ
తీ నిలయమైన భారతదేశ వాసు
లందరిని ఐక్యపరచు రహస్య బంధ
నముల కనుగొన్న నెహ్రూ లేడు మన కింక.

సర్వదేశ సమత్వ సహజీవన తటస్థ
నీతి నేర్పిన రాజనీతివేత్త
సకల ప్రజాభ్యుదయ కర ప్రణాళికా
సామ్య వాదార్థిక శాస్త్రవేత్త

విమల విశ్వప్రేమ విడని స్వార్థత్యాగ
ధనము పెంచిన పూర్ణతత్వవేత్త
మానవావళి మనో మౌన వేదనలకు
శాంతి గూర్చిన మనస్తత్వవేత్త

పండిత జవాహరుండు ముప్పాతికేళ్ళ
తానె భారత దేశముగాను, భరత
దేశమే తానుగాను వర్ధిల్లిపోయె
నెహూరు ఇహపర పూజనీయ హరిహరుడు.

దేశం బంతయు ఆ మహామహుని సం
దేశంబు పాటించి, స్వే
చ్ఛా శాంతి ప్రగతి ప్రదీపన సుదీ
క్షాబద్ధులై నాయకా
ధీశుల్ పాలనసేయునట్లు మము ఓ
దేవా ! కటాక్షించి, పూ
ర్ణాశాభావము, త్యాగ శీలము, సమై
క్య శ్రీలు చేకూర్చుమా !

# మృత్యువు

ప్రాణికోటి వసించు ప్రపంచ జలధి
నెన్నొ కనరాని వలలను పన్ని, జీవు
లను తరతరాలుగా పట్టుకొని భుజించు
చున్న ఓ మృత్యు ! నాకు నీ వన్న భయము.

పుట్టెడి ప్రాణుల కొరకై
పుట్టెను ఈ సృష్టి, కాని భువిపై ప్రాణుల్
పుట్టుట గిట్టుట తుది నీ
పొట్టం జేరుటకె ! వింత పో విధి కట్టా !

ఇల పూచినట్టి జీవులు రాలి నీ కంఠ
హారమ్ము జేర నున్నట్టి పూలె
వసుధ శ్రుతించు జీవ ధ్వనుల్ నీ కాలి
అందెల జేర నున్నట్టి ధ్వనులె
భువి రెక్కలార్చు ప్రాణి విహంగరాజి నీ
నయనాగ్ని కాల నున్న శలభములె
బ్రతుకుబాటల సాగు ప్రాణులు నీ గర్భ
చితి చేరవచ్చుచున్న తెరువరులె

భూ చరమ్ములు, జలచర ఖేచరములు
ధర వయోభేద లింగభేదములు లేక
భవ దనంత క్షుధాగ్ని నార్పగ జగాన
కురియు క్షణికపు వాన చినుకు లనిపించు.

పాప మంటని పసిపాప లంచు, బ్రతుకు
భారమ్ము తెలియని బాలు రనియు,
వెతలేని యువక దంపతు లని, ప్రణయ వ
ల్లికల పెంచుకొను ప్రేమికు లటంచు,
తలిదండ్రు లని, పోషకు లని, నిర్మల వయో
వృద్ధు లనియు, జ్ఞాన వృద్ధు లనియు
నిరుపేద లని, ధనాన్వితు లని, కష్టజీ
వులని, భోగులని, పాపులని గాని

ఏ విచక్షణ లేక సుంతేని కరుణ
లేక జీవులను బ్రతుకనీక, ఒకరి
కొకరి నెడబాపి, పొట్ట నింపుకొని మృత్యు
వా! అవని శోకమయముగా జేయ నేల?

పలు రోగముల రూపములు దాల్చి ఒకసారి,
అగ్ని ప్రమాదమవై ఒకపుడు,
పాము కాటుగ, జారుపాటుగా ఒకసారి,
ఆత్మహత్యా వాంఛవై ఒకపుడు
బాకుపోటుగ, ఎదో బాంబుపాటుగ, భయం
కర యుద్ధరూపిణిగా ఒకపుడు
వరదవై, పిడుగై, తుపానువై, భూకంప
మై, శిలాద్రవరూపివై ఒకపుడు

అవతరించి జీవులను స్వాహా యొనర్చ
అటుల జచ్చె, ఇటుల చచ్చె నని జనమ్ము
భ్రమల చిక్కి ఏడ్చెదరు; పబ్బమ్ము నీకు!
కామరూపిణివే మృత్యుకాంత నీవు!

ఒకవేళని ఒక చోటని
ఒక సందర్భమని నియమ మున్నట్టులు లే
దు కదా నీ వేటకు, చే
తికి చిక్కిన చాలు నంతె తిని వేతువెగా!

సురలు సుధ గ్రోలి నిను జయించిరి స్థిరముగ
జడ జగత్తేమొ నీకు లోబడదు; ఇంక
దొరికెనా ప్రాణికోట్ల ఊపిరులు నీకు
చావు లేదేలనే మృత్యుదేవి నీకు ?

నిను నిందింతునుగాని, నా ఎడద ప్ర
శ్నించుఁ ధరాకాశ వా
రి నిధుల్ గెల్చుచునున్న మానవుడు గ
ర్విష్ఠుండు, లోభుండు, హా
యిని కాంక్షించెడి వాడు నీవను భయ
మ్మే లేనిచో ఈ జగ
మ్మున ఎన్నెన్ని హిరోషిమాలు నరక
మ్ముల్నించునో ? యంచునన్.

(1964)

# యౌవనవీణ

రాలిన పూల తావుల స
రాగములన్ స్మరియించుకొంచు, దుః
ఖాలను పాడుకొంచు, నవ
ఖాండవ సూన సుధాస్రవంతి గా
నాలను బీటువారిన మ
నమ్ముల పారగ నీక; భగ్నలో
కాల సుఖింత మంచనెడి
కల్పిత తత్త్వ మసహ్య మయ్యెడిన్.

నా నవ యౌవనాంబరము
నన్ శివమెత్తిన కామ మేఘ రా
గాన సుమించునట్టి అణ
గారని ప్రేమ తటిల్లతా ద్యుతుల్
ప్రాణసఖిన్ ననున్ ప్రణయ
బంధమునందున చేర్చి నాకలో
కానుభవమ్ము గూర్చు; పరి
హాసము కామన లేని ప్రేమయా!

ఈ వాసంత వసంతికా రవములున్
ఈ శాద్వలీ శోభలున్
ఈ విద్యుల్లతికల్ మహోపవనముల్
ఈ నిర్ఝరుల్ పూర్ణిమల్

దేవీ జీవకళా విలాసములలో
        దీపింప లేనష్టు ని
ర్జీవమ్మౌ చను గాన ఈ ప్రకృతిలో
        జీవింతు దేవీ హృదిన్.

రెండు గుండెలు ఏకమై యుండుచోట
నేలబడు నిండు దుఃఖ భూతాల వేట
రెండు గుండెలె విడిపోయి యుండుచోట
కాలబడు పండు సౌఖ్య పుష్పాలతోట.

ప్రణయిని సంస్మృతిన్ విరహ
        రాగ విపంచికపై నిరాశగా
గొణుగుచు పాడుకొంచు బ్రతు
        కున్ బలిచేయను చేతగామికిన్
వినిచెద యౌవనాభ్యుదయ
        వీణియపైన విశీర్ణలోక వే
దనలకు చైత్రగీతములు,
        తన్వి కవోష్ణ నవోష్ణ పాయినై.

( 1956 )

# మహోదయము

అదిగో! ఉదయించె నేడు మహాంధ్రదేశ
ప్రాగ్దిశా తీరమందు ప్రభాకరుండు
కోటి హస్తాలు సాచి ముక్కోటి పేటి
తెలుగులను హత్తుకొనె కవుంగిలిని ఒకట.

కృష్ణవేణీ గోదావరి కీర్తి వాహి
నులు మహానంద విమల వీచులు నటింప
స్వాగత మ్మిడుచుండె వేవేగ సాగి
ఆ ఉదయభాను మూర్తికి ఐక్యమతికి.

గత నిశా జీవితాల దుర్గతి సహించి
కఠిన తపమాచరించి నిక్కముగ నేడు
ఈ ప్రభాతాంశువులు సోకగా ప్రఫుల్ల
మయ్యె తెల్గుల హృదయ పద్మాళి శాంతి
సౌఖ్య సుమధురాశాభావ సరసి లోన.

ఈ మహోదయ సందీప్తికే మహాత్మ
లెందరో జీవితాల నర్పించినారు,
ఇది మహాంధ్ర భాగ్యోదయ మ్మిది ప్రజా వి
జయ మిది మహాభ్యుదయ రమా జయ విజయము

ఈ యమృతోదయ ప్రభల
ఈ ఎనలేని మహానుభూతిలో
నీ యెదలోని కల్మషము
నీటను దోసి, మనోజ్ఞ దివ్య శో

భా యుతమైన ప్రేమ సుమ
వాటిని నాటుము, తత్కాశాత్మక
శ్రీయుతమౌ సుగంధములు
చిందగ సర్వదిగంత వీధులన్.

సంకుచితత్వము, స్వార్థము
పంకిల రాజకీయములు, వ్యాపారకళల్
శంకత్వము, మౌఢ్యము నే
డింక విడచి, శాంతి సుఖము లేలుద మిటుపై.

స్థిర మవును గాక ఆంధ్రప్రదేశ కీర్తి
ఉజ్జ్వల మ్మౌత భారతాభ్యుదయ దీప్తి
శాశ్వత మ్మౌత ఈ విశ్వశాంతి కాంతి
ప్రగతిభానుడు వెల్గుత జగతి నెపుడు.

(ఆంధ్రప్రదేశ్ అవతరణ సందర్భంలో చేసిన రచన.)

(1956)

# ఇతి కర్తవ్యము

మానవు డాత్మ వీడి పర
మాణువు గూడియు, స్వార్థతా సురా
పాన మదాంధుడై తన ప్ర
పంచములో విలయాగ్ని రేపగా
పూనెడి కుట్రలన్ తెలిసి
భూ జనయిత్రి ప్రియాన కన్న సం
తానపు ద్రోహబుద్ధికి మ
నమ్ము విదల్చక ఏడ్చె నల్లదే!

తరతరాలుగ తాను బాధలకు నోర్చి
పెంచి పెద్దచేసియు చదివించి, శక్తి
మంతులను చేసి, ఇక పై సుఖింతు నంచు
ఎంచు ఉర్వర హృది కత్తిరించు నరుడు.

ఛీ! దురితాత్మ! గుండెపయి
చే యిడి చెప్పుము మానవా! రణో
న్మాదము మర్త్యరక్త రస
మాంస బుభుక్షలు పొంగులెత్తి నీ
లో దుసిగిల్లలేదె? సుర
లోకము చూపెడి నీ స్వతంత్ర శాం
త్యాది ప్రసంగముల్ విష మ్రు
షాత్మక మైనవి కా దనందువా!

అసురుల నేల గూల్చి, కుటి
లాత్ముల పేల్చి, తపించి, ఘోర సా
హసములు చేసి, మానవత
కాయువు పోసి, సుసంస్కృతీ వసం
త సుమ వనమ్ము పెంచిన గ
తమ్మది నీది; స్వసృష్టి నేడు బా
మసమున బూది సేయుదువె?
మర్కటమానవ! దానవుండవై!

విశ్వసాహిత్యాలు, విసము గ్రక్కెడు నీదు
గుండెలోతుల దూరి మండిపోవు
చిత్రలేఖనము నీ శిశిర తాండవములో
శిథిలరూపముగాని చితికి పోవు
శిల్పమ్ము నీ భయోత్కల్పక యంత్రాల
కాంచి కంపించి వికల్పమొందు
మానవత్వము నీ అమానుషతత్వమ్ము
చెరలో బడి ఉపవసించుచుండె

హంతకుడ వని నినుగని 'శాంతి' బెదరి
అడవులంబడి పారిపోయెడిని, జీవ
కోటు లాక్రందనమున సంక్షోభ మంద
ఏమి సాధింతువోయి, నీ వింత చేసి?

యంత్రముల మాయలో చిక్కి ఎంతలోన
మనిషి! మనిషిని వేటాడ మరగినావు!
పశుబలపతాక లేపు నీ ప్రజ్ఞ చూచి
పరిహసించు నోరెరుగని ప్రాణు లవియు.

ఇలపైనున్న సమస్తమున్ గెలిచి నీ
విన్నాళ్ళుగా బుద్ధి శ
క్తులచే కాంచిన దివ్య భాగ్యముల-నీ
దుర్మార్గమున్ వీడి ఉ
జ్జ్వల సౌభ్రాత్రము సౌమ్యమున్ వెలుగ వి
శ్వమ్మంతటన్ పంచి, శాం
తి లతల్ పెంచుము, ప్రేమజీవనములన్;
దీవించు నిన్ సృష్టియున్.

# సు భా సు వా ణి

చచ్చితి నంచు కొందరును
చావగలే దని కొంద రెప్పుడో
వచ్చు నటంచు కొంద; రెటు
వచ్చును చచ్చిన నంచు ఊహకున్
వచ్చిన రీతి ఎవ్వరికి
వారు తలంతురు; నాకు అందరున్
నచ్చినవారె యౌట, పడి
నాను విచిత్ర వివాద నీరధిన్.

చచ్చితినా లేదా, నేనే
ఖచ్చితముగ చెప్పలేను, కడలి కడుపులో
చొచ్చిన సూర్యుడు చచ్చునె?
చచ్చునె తమసాబ్ధి మున్గు చంద్రుడు చెపుమా!

చచ్చితి నందునా స్వాతంత్ర్య వీర జీ
వన భావనలలోన బ్రతికియుంటి
బ్రతికితి నందునా పారతంత్ర్యము పిల్చు
పచ్చినెత్తుటపడి చచ్చియుంటి
చచ్చితి నందునా స్వారాజ్యలక్ష్మి భా
రత సౌధ కుడ్యాల బ్రతికియుంటి
బ్రతికితి నందునా స్వార్థ సంకుచిత దం
ష్ట్రల చిక్కి ముక్కలై చచ్చియుంటి

చచ్చితినె, లేదు బ్రతికిన జాడ గలదు
బ్రతికితినె, లేదు చచ్చిన వార్త గలదు
బ్రతికి చచ్చిన వీర సుభాసు నేను
చచ్చి బ్రతికిన జీవనాశయము నేను——

ఎవరికి చెప్పకుండ భర
తేంచిర బంధవిమోచనార్థమై
అవలికి పోయినాను, అసు
రాయుధశక్తి నహింసతో జయిం
చ వశము కాదు కాదని స
శస్త్రిడనై భరతోర్వి శత్రు శ
త్రువులను కూడినాను, జయ
తోరణముల్ రణమందు కట్టితిన్.

శోకతిమిరము తొలగించు జ్యోతికొరకు
వదలినటు బుద్ధుడు కపిలవస్తు పురము
దాటిపోయితి దాస్య కవాటములను
తిరిగి రానెంచి స్వాతంత్ర్య తరణితోడ.

తమ మాటల్ వినినాడ కాదని——అస
త్యమ్మెమొ సత్యాన, ద్వే
షమునో రాగముతోడ గెల్చుట కహిం
సా శాంతి మార్గాననే
తమవెంటన్ చనినాడ కాదని——మహా
త్మా గాంధి నెహ్రూజి స్వాం
తములం దెంతయు కుందియున్ అనరె నే
తాజీ భలే యంచు నన్!

పారతంత్ర్య తమస్సు పౌరుష ఖడ్గ ధా
రారుణ ప్రభల చెండాడునట్టి
ఉన్మత్త మత్తమహోగ్ర సామ్రాజ్య వా
దాసుర మకుట మడంచునట్టి
కులమత జాతి సంకుచితత్వ దుర్గాల
చీల్చి మానవుని రక్షించునట్టి
మలయా హిమాలయ వలయాన గుర్రంకబో
నన్న సూర్యుని చెరగొన్న యట్టి

దేశ భక్తోష్ణరక్త ప్రవాస భార
తీయ రణ వీణ అజాదు హింద్ సేన,
నాటె తొలిసారి ప్రాగ్దిశా వాటిలో త్రి
వర్ణకేతన వల్లి గర్వాల వెల్లి !

స్వాతంత్ర్య సమరాన సాగిపోవుట తప్ప
స్వార్థచింతనము విశ్రాంతి లేని
ఆదర్శసిద్ధికై త్యాగధనము తప్ప
లఘుపథార్జిత ధనలక్ష్మి లేని
జైహింద్ జైజై విజయగర్జనలు తప్ప
అంతః కలహ భవు భౌలు లేని
ఆగ్రహ సత్యాగ్రహాస్త్రధారులు తప్ప
పనికి మాలిన పిర్కిపంద లేని

రోజు లవి, జీవితాలె కర్పూరమట్లు
కరిగి, గిరినిభ దాస్య పంకమును కడిగి
వేయు ఆ రోజులు స్మరించు నా యెడంద
పొంగిపోవు హిమాలయ శృంగమట్లు.

స్వాతంత్ర్యోదయ మయ్యె భారత జన
స్వప్నాలు పండెన్, అహో
నేతాజీ కనరా డదేమి? తన సం
దేశమ్ము విన్పింప డే
లా? తారాపథ చుంబి కీర్తిమయు డే
లా? చంద్రుడేలా? జగ
న్మాతృ శ్రీనయ నోత్పలమ్ములకు ఆ
నందమ్ము కల్పింపడో?

అని జనవాణి ప్రియమ్మున
నను తలచి నుతించె, లోకనాకము లొకపై
నను ముంచెను తాదాత్మ్య
మ్మున జీవన్మరణ రహిత మోక్షస్థితిలో.

బాపూజీ బలి యయ్యె దుర్మత తమో
వ్యాళోగ్రవాహాగ్నికిన్,
ఆపై దీపము ఆరిపోయినటు స
ర్దారుండు కన్మూసె, ఇం
కాపై రాలె ననేక తారకలు జ
హ్వార్లాలు, శాస్త్రీజి, దు
ష్కాపట్య క్షతగాత్రు లైరి భరత
క్ష్మామాత దౌర్భాగ్యమో!

మనుషులు మహాత్ములెందరు మరుగుపడిన
మరుగు పడరాదు స్వాతంత్ర్య తరణి దీప్తి
చితికి పోరాదు ఏ పరిస్థితుల నైన
మీ మనోగత మానవతా మతల్లి.

(1969)

# నివేదన

ఉన్నావో లేవో ఎట
నున్నావో తెలియకున్నదోయి మహేశా!
నన్నేల సృజించితివో
ఇన్నిన్ని అయోమయాల ఇడుముల మధ్యన్?

భయ శంకలు, బాధలు, వి
స్మయములు నన్నావరించి మరి మరి వేచున్
లయ తప్పిన శ్రుతి యయ్యెను
క్రయ విక్రయ వీధి యయ్యెగా నా బ్రతుకే!

ఎక్కడనో గల తారలు
ఇక్కడ పడియున్న నన్ను ఏడ్పించునురా!
ప్రక్కన గల చిరుగాలులు
మక్కువతో అనునయంపు మాటలు చెప్పున్.

రక రకముల గొంతులు నను
చక చక రమ్మంచు దశ దిశలతో పిల్చున్
చకితుడనై ఎటు తోచక
అకటా! ఎట నుండినానొ అటనే ఉంటిన్!

నా ఎదలో శివ మెత్తిన
మాయల ఊహములు, మంచుమల కొమ్ములపై
ఊయల లూచుచునే పడ
ద్రోయును నను లోయలను అధోలోకములన్.

తమసమ్ముల కనగానే
హిమమై పోవుదును శక్తిహీనుడ నౌదున్
కమలాప్తు దీప్తి కనగనె
అమితావేశాగ్ని శిఖల కాహుతి యగుదున్.

తెలిమబ్బుల మైదాన
మ్ముల జాబిలిబంతి యాడ బోయి, నిరాశన్
జలధి హృదంతర మౌక్తిక
ముల రత్నము లేరు గొనగ ముచ్చట పడుదున్.

అర్థము వెంట ఒకపుడు, ప
దార్థ జ్ఞానమ్ము కోసమై మరొకపుడున్
స్వార్థమ్ముల వెంటను, పర
మార్థమ్ముల వెంట బడి నిరర్థకు నైతిన్.

మారుతమువోలె నా ఊ
హా రుతములు నిల్వలేవయా ఒక చోటన్
నీరదము వోలె నా ఎద
మారుచునే ఉండు ఏది మార్గమ్మో? ప్రభూ!

నా కనుల భ్రాంతి కొల్పెడి
చీకటి తెరలేవొ కలవు చిక్కవు నాకున్
లేకుండిన అడుగడుగున
నా కెందుకు ఇన్ని మాయ నాగులు తగులున్.

ఆది తుది లేని సృష్టికి
కా దని ఔ నంచు నీవె కారణ; మెంతన్
వాదించి వివాదించిన
లేదు సమాధాన మెరుగలేరు నిజమ్మున్.

నా క్షుభితమైన మేధకు
ఏ క్షణమున శాంతి లేదు ఈ చీకటిలో
చక్షువు నా కీవే, పరి
రక్షణ మీవేను చూపరా వెల్గు! ప్రభూ!

(1970)

# చంద్రవిజయము

ఘన ఘనాపూర్వ విజ్ఞాన కవచ ధారి
భావనాతీత పృధు రోదసీ విహారి
రాగ మసృణ విశ్వంభర రాయబారి
అడుగు పెట్టెను చంద్రలోకాంగణాన.

తన నిర్జీవాంకము విడి
చనె జాబిలి యంచు వగచు జగదంబకు నే
డెనలేని పండు గయ్యెను
మనుజుడు భూమాత చంద్రమాతను కలిపెన్.

ఇతిహాసస్థ పురాణ వేద గత మా
        నీంద్ర శ్రుతి క్షిప్తయో
గ తపోంతర్గత సృష్టి జీవన రహో
        గాధల్ ఎవో భావనా
లతలో స్వప్నములో విముగ్ధ మధురా
        లాపమ్ములో గాక, భా
వి తమః క్షేత్ర సుషుప్త వాస్తవికతా
        బీజమ్ములై లేచెడిన్.

చెరగని ఆత్మజ్ఞానము
తరగని మేధా జనిత పదార్థ జ్ఞాన
మ్మిరు కడల వెడలి కలిసెను
పరిణామ ద్వంద్వ ప్రకృతి పథ మేళనమై.

భూమి జయించె మానవుడు,
భూరి పయోనిధులన్ జయించెగా;
వ్యోమముకూడ నే డసదృ
శోద్గమ మందు జయించి మించె, ఇం
కేమిటి, భావి జీవన గ
తీందిర లక్షిత లక్ష్య మేమిటో ?
ఏమిటి ఏమి టంచు నిన
దించె నవే చకితాంత రాళముల్.

కరువులు కాటకాల్ బ్రతుకు
కష్టము లన్నియు తీర్చుకొంటకై
వరము లభించెనా, పరుల
భాగ్యముకోసము నేలకోసమున్
జరిపెడి యుద్ధ తంత్రముల
జాడలు గోడులు మాసిపోయెనా,
ధరణికి స్వర్గ సీమకును
దవ్వౌ కడుంగడు తీరిపోయెనా ?

తన కుటుంబపు గొప్పతనముకై ఊ రెల్ల
'తగలెట్టు' సంకుచితత్వ నీతి
తన ఊరు పేరుకై తన రాష్ట్రిమంతకు
గరళమ్ము పెట్టు మూర్ఖత్వ నీతి
తన రాష్ట్రి ఘనతకై తన దేశవృద్ధిని
భంగపరచు దానవత్వ నీతి
తన దేశ యశము కితరదేశముల బలి
దానము గొను మనస్తత్వ నీతి

మానవు డజేయు డికపైన మాను కొనునొ
లేక, తనలోకమైన భూలోక కీర్తి
సాధనకు సర్వ లోకాల శాంతి సుఖము
చెరగొనునొ, స్వార్థ లోభాలచేత జిక్కి.

(1970)

# కళాతృష్ణ

అందము అందమే మనకు
　　అందిన అందకపోయినన్; మన
స్పందన వేరు తార్కిక వి
　　వాదము వే; రవి రెండు భావనా
నంద నదీ తటద్వయము
　　నా విలసిల్లును; ఇంద్రి యానుభూ
తీందిర పేదవోదు పడ
　　గెత్తిన ధీ బలశాస్త్ర మెంతయున్.

రాలును రప్పలున్ పనికి
　　రానివి కొండలు గోతులున్ వినా
గాలియు నీరు లేని ఎడో
　　గందర గోళము చంద్రగోళ మం
దాలకు ప్రోవు గాదనుచు
　　అద్భుత చిత్రము లెన్ని చూపినన్
రేల నభోంతరాల శశి
　　రేఖల చూచి చలింప కుందుమా!

ఎముకల గూడు, నాడులకు
　　ఇల్లకళంక కళంక రక్త నా
ళముల సమూహమున్, పలల
　　రాశి, కళాసపుత్రి యేను, దే

హమని ఎరుంగు డాక్టరున
కందము చందము కానుపించదా !
రమణుల చూచినప్పుడు స
రాగపరాగముపొంగు తెత్తదా !

మబ్బులందు పై నించి విమాన మందు,
ఏమి గలదిందులో ధూళి ధూమ మనుచు
అను కొనుచు నేలపై దిగ, అంబరాల
తేలు జలదాల అందాల తేలిపోమె ?

బాధ పడెడువారు, బాధించు వారును
వట్టి అభినయించు వారె యంచు
తెలిసి కూడ వెండితెరమీద దృశ్యాలు
గాంచి కంటనీరు నించుకొనమె ?

పుట్టినది గిట్టు బ్రతుకు బుద్బుదమె యంచు
ఎరిగియున్ నరుల్ చావు పేరెరుగ నట్లు
ప్రాకు లాడరె యశము ప్రాభవముకొరకు
వాస్తవము కన్న బ్రతుకున భ్రాంతి మిన్న !

చంద్ర విజయమ్ము, విజ్ఞాన, శాస్త్ర జృంభ
ణమ్ము, ఊహాజనిత కననమ్ములకు
కళలకు విఘాత మనెడి సుద్దు లవి మిధ్య,
శాశ్వతము కళాతృష్ణ ఆ జాబిలి వలె !

( 1971 )

# రాగ భగవతీ!

ఈ భావ వనములందున
ప్రాభాత సమీర మట్లు పాడెడి నను, రా
శీ భూత సౌరభ జ్వా
లా భామినివోలె ఎందులకు కాల్చెదవే!

రాయినిగాను నేను జవ
రాల! భవద్రసవాక్కు దృక్కు గం
గా యమునాపగోర్మికల
కాగితపుంపడ వట్లు తేలు, పా
పాయిని, రాగ పుష్ప మధు
పాయిని, నీ గుణరూప చైత్ర శో
భాయుత గీతికా రచన
మందు ఋషిత్వమునొందు ధన్యుడన్.

నీ కరబంధనాల నవ
నీతమువోలె ద్రవించి పోవగా
నీ కబరీభరమ్మన వి
నీలపయోధరమై లయించగా
నీ కనునీడలందు దయ
నీయ ఖగ మ్మటు నిద్రపోవగా
నీ కలలన్ తలంపులను
నే నితివృత్తము కా తపించెదన్.

గాజుల మ్రోతలో విజయ
కాహళ గర్జలు చేసినాను, నీ
రాజమరాళయానమున
రాజ్యములెల్ల జయించినాను, నీ
రాజసమూర్తిలో భువన
రంజకకీర్తి గడించినాను, రా
రాజును నేను నన్ను రుచి
రమ్ముగ నేలెడి రాణివీ వహో !

దైవము నాకు కృష్ణుడు స
దా, తొలి రోజుల బాలకృష్ణుడే
దైవము నాకు, నా బ్రతుకు
దారులు చూపెడి వెన్నదొంగయే
దైవము, రాధికానయన
తామరసాశ్రుమరంద ధారలో
జీవన వేణుగాన మగు
శ్రీపతి దైవము నీకు నా కిలన్.

నీకును నాకు ఛాందసుల
నేమమునన్ యతి చెల్లదేని, గే
యాకృతిలోన ప్రాసయతి
నైజతనొందును నీకు, మెచ్చు నీ
లోకము, భావుకాధునిక
లోక మహోభ్యుదయోన్ముఖ ప్రజా
నీకము, ప్రేమవాహినివి
నీకు రసాబ్ధిని నాకు అడ్డులా!

ఎందుకు నిన్నుగూర్చి ఎద
నింత తపింతును, తోలుబొమ్మవే
యందును, కాని అందె నుడి
కందని అందము లెన్నియో రసా
నందము లెన్నియో వెదకు
నా సకలేంద్రియముల్ మరెవ్వ రే
మందురొ కాని, జాలిపడు
మందును నాపయినిన్ త్రపామయీ!

స్నేహ పరీమళార్ద్రిమగు
చిర్నగవొక్కటి చాలు, నందు దా
సోహము, ద్రోహబుద్ధి బల
శూరులు స్వార్థకుబేరు లందమౌ
వ్యూహము లెన్ని పన్నిన ప్ర
యోజన ముండదు నన్ను గెల్వ, సందే
దేహము లేదు నా క్షణిక
దేహము సత్యచిదాత్మ నీవె యౌ.

తీరములేని రోదసిని,
ద్వీపము దీపము వంటి జాబిలిన్
దూరము భార మంచనక
దోర్బల ధీబల సాహసాద్రులై
చేరిన వ్యోమగాముల వి
శిష్ట విచిత్ర చరిత్ర జూచి నిన్
చేరగవచ్చు నన్న ధృతి
చే నినుగోరితి నక్షత్రసూనమా!

కంబుగళంబు, చక్రముఖ
కంజ కళావిభవంబు, వీణ రూ
పంబు వహించు నీ జఘన
భాండము నీ తలబంతి నీ జడల్
బింబము లౌట శ్రీహరికి
విద్యలరాణికి, నామనంబు దే
హంబును పల్విధంబుల ప్రి
యా! నిను గొల్చుట సాజమే గదా!

కందము లిరుకడలుగ, నా
డెందము సూత్రమ్ముగా వడిన్ గ్రుచ్చిన ఈ
సుందర భావోత్పల మా
లం దమితో స్వీకరించు రాగభగవతీ!

( 1972 )

# ఆశల ఉగాది

వచ్చె ఉగాది. వచ్చె ప్రతి
వత్సర మట్టులనే వసంతమున్
తెచ్చెను, వృక్షముల్ లతలు
నిర్మల పల్లవ పుష్ప శోభతో
ముచ్చటగొల్పె, కోకిలలు
మోహనరాగము లాలపించగా
పచ్చని మామిడుల్ కనుల
పండువుగా కుసుమించి కాచెగా !

మామిడి పూచినట్లు మధు
మాసము హాసము చేసినట్టు లా
రామములోన కోకిలలు
రాగము లల్లిన యట్లుగా, కవి
స్వాములు ఈ ఉగాది దొర
సానికి స్వాగత గీతు లల్లు టిం
కేమిటి కన్న నేను కవి
నే అయిపోయితి ఈ ఉగాదికిన్ !

ఇందుకె నా మనమ్ము విజ
యేందిరకున్ మనజాతి జీవనా
నంద వసంత లక్ష్మికి ఘ
నమ్ముగ స్వాగత గీతి పల్కు ఇం

దిందిర మయ్యె సత్యవలె
దేశరథమ్మును ఈ ఉగాదియే
ముందుకు త్రోలగా చితికి
పోవలెరా నరకుల్ నరాసురుల్!

మనిషిని మార్చగల్గెడి స
మర్థుడు మానవుడేను, కాని ఆ
మనిషియె మానవాళికి ప్ర
మాదములందు ప్రమాద మయ్యె, ఏ
మనిషి జగమ్ము స్వర్గముగ
మార్చెడి రాగ సుధామయుండొ ఆ
మనిషియె ద్వేష హాలహల
మార్గమునన్ కను నారకమ్ములన్ !

శిశిరమ్ము తలదన్ని శిరమెత్తి నిల్చిన
ఎనలేని వనరమ ఈ ఉగాది
కంటకాలను పూలమంటల గాల్చిన
హేలావిలాసిని ఈ ఉగాది
బెల్లమే మామిడి పిందెయే వేప పూ
వే గొప్పయని చెప్పు ఈ ఉగాది
ఎండనాగుల బారినుండి లోకమును ర
క్షించు ప్రపాబాల ఈ ఉగాది

గున్న మావులవలె పేద గుండె లన్ని
పూచినవి నేడు ఆశల పూలు, కలలు
పండుచో వచ్చెడి ఉగాది పండుగను మ
హా వసంతుడనై కళ్ళ కద్దుకొందు.

( 1970 )

# ముక్తి వాహిని

ఆగదు విప్లవ మ్మిక ని
 యంత ల దెంతటివారలేని, స్వే
చ్ఛా గగనమ్ము చిమ్ము [illegible]
 సత్ పృథుకాంతిశరమ్ము లేచె నో
హో! గరళమ్ము గ్రక్కు మటి
 లోగ్ర మహా పరదాస్య [illegible]!
ప్రోగెను బాంగ్లదేశ జయ
 మోహన సింధుగళాల [illegible].

పదనుకత్తుల వోలె పదునుచూ ల్గెగిసిరి
 బాలురై రదె పసిపాప లంత
కన్నెపిల్లలు మిషన్‌గన్నులై నిల్చిరి
 ముదుసళ్ళు ముల్లెల మోతలైరి
వీర విద్యార్థులు ధూరిబాంబులు కాగ
 ఉద్యోగులే వృత్తి విద్యలైరి
రాళ్ళురప్పలు సహా రైఫిళ్ళు తూటాలు
 అడవులు గిరులు రణాంగణములు

ముక్తివాహినియై జనశక్తి మించె
పారతంత్ర్యోగ్ర వలసాధిపత్య దాస
వత్వమును కూల్చె నదె ప్రజాస్వామ్య లక్ష్మి
కలదె స్వాతంత్ర్యమునకన్న ఘనధనమ్ము?

సైన్యోన్మత్త నిరంకుశత్వము ప్రజా
స్వామ్యమ్మునే తన్నె , ఏ
మన్యాయం బని ఏడుకోట్ల ప్రజ ప్ర
హ్లాదుండునా లేచె , కా
రుణ్య శ్రీహరి షేక్ముజీబు నరశా
ర్దూలంబునా చీల్చె నా
హా ! న్యాయాత్మక దాస్యరాక్షస మహా
హంకార వక్షంబులన్ !

నీతి నీమము వీడి సీతను చెరగొన్న
రావణుం డాతని రాక్షసతతి
సత్యశాంతి ధర్మసతుల హింసించిన
దుర్యోధనుడు వాని దుష్టశతము
పాపమే ఎరుగని ప్రజల భక్షించిన
బకుడు నరకుడు తత్పాపిగణము
మానవత్వపు టింట మంటలు రేపిన
హిట్లరు అతని స్నేహితుల మూక

చచ్చి రే గతి ఆ గతి చావగలరు
పశుబలముతోడ కండకావరముతోడ
మానవుల రక్తమును త్రాగ మరిగినట్టి
దుష్టులౌ బాంగ్లదేశ విద్రోహు లెల్ల.

అరువుకు తెచ్చుకొన్న బల
హంకృతితో చెలరేగు శత్రు శా
ర్వరపటలాలపై ప్రజల
పౌరుష రోషము లంబుదంబులై

కురిసెను నీరుగాదు పిడు
గుల్ పడగన్ తుపాకిగుండ్లు, బొం
గ రుధిర సాగరాత్మకము
గా ప్రభవించెను బాంగ్ల ముక్తిన్.

భారత భూరమ బాంగ్లా
స్వారాజ్యేందిరకు పత్యా స్వాగత గీతుల
ఈ రెంటి మైత్రి హిందూ
పారావారాంకమందు ప్రతిష్ఠితమౌ !

ఒకటే రాష్ట్రము నేడు భారతము యు
ద్ధోన్మాదులన్ కూల్చగా
ఒకటే మాట విరోధి సైన్య సమర
వ్యూహమ్ములన్ చీల్చునన్
ఒకటే శక్తి సమైక్యభారత జన
జ్యోతిందిరా మూర్తిమాన్
ఇక ఈ దిగ్విజయోత్సవ ప్రభలు దీ
పించున్ జగద్వీధులన్ !

( 1971 బాంగ్లాదేశ విముక్తి పోరాటకాలంలో పొంగిన భావసాగరం )

# విజయేందిర

ఇందిర వీవు, భారత జ
  నేందిర వీవు, స్వతంత్రభావ గ
తీందిర వీవు, దీన బల
  హీన జగజ్జనతా వికాస క్ష
త్రేందిర వీవు, శాంతి సమ
  దేందిర వీవు, పవిత్ర సామ్యవా
దేందిర బాంగ్లదేశ విజ
  యేందిర వీవు, జయస్వరూపిణీ!

ఏనాడు నీ మనంబున
జోనాఫార్కు ప్రదీప్త జ్యోతి వెలిగెనో
ఆనాడె నేటి భారత
సేనల దిగ్విజయ బీజ సేచన మయ్యెన్!

శాంతియె తప్ప నల్దిశల
  క్రాంతియె తప్ప పరాజయమ్ము గా
రంతయులేని దిగ్విజయ
  యాత్రలలో వెలిగించినావు సం
క్రాంతిని, భారతీయ చిర
  కాల చరిత్ర పుటమ్ములందు కొం
డంతల చీకటుల్ తొలగు
  నట్లు యశోద్యుతి పండునట్లుగా!

నింగియు నేల సంద్రములు
        నేడు గడంగడలాడిపోయె, త
త్సంగర భూము లన్నిటను
        శత్రువు చిత్తుగ ఓడిపోయె, ఉ
త్తుంగ హిమాద్రిశృంగ మటు
        తోచెను భారతజాతిశక్తి, నీ
మంగళమూర్తియే భరత
        మాతృ జయోర్జిత వజ్రమూర్తి హో!

అసురుల కొందర హతమార్చె రాముడు
        అసురత్వమే నీవు అణిచినావు
దుష్టుల కొందరిన్ దునిమిరి పాండవుల్
        దుష్టత్వమే నీవు దునిమినావు
నరహంతయౌ ఒక్క నరకు ద్రుంచెను సత్య
        నరకత్వమే నీవు నరికినావు
మహిషు నొక్కని గూల్చె మహాలక్ష్మియౌ దుర్గ
        మహిషత్వమే నీవు మాడ్చినావు

వ్యక్తివా కాదు, నవసంఘశక్తి వీవు
మనిషివే కాదు, ఉజ్జ్వల మానవతవు
ఇంటిలోపలనే కాదు, మింటిలోన
దీప మీవు మా ఆశల రూప మీవు !

(1971 డిశెంబరు యుద్ధంలో భారతదేశాన్ని వరించిన
అపూర్వ విజయేందిరకు పట్టిన అక్షర దీపం)

# చూడలేని సూర్యుడు

రవియు కాననిచో కను కవి యటంచు
కవి ఎవడు శాపమిచ్చెనో కాని, ఇనుడు
కాంచలేనట్టి చీకట్లు కాంచి కాంచి
కరగుచుంటిని దుఃఖాశ్రుకణము నౌచు.

ఓ రవి ! నింగిదారుల మ
హోజ్జ్వల కాంతిరథమ్ము నెక్కి నీ
వారయునట్టి దేమి? జను
షంధువు సైతము చూచు బాహ్య సం
స్కారమెకాని దాని వెన
కం గల స్వార్థ పిశాచకృత్య ఖాం
డారము కాదు, కాదు చిరు
నవ్వుల దాగిన కారుచీకటుల్.

దిట్టముగా భవ న్నయన
దీధితు లెల్లెడ ప్రాకు వేళలన్
గట్టుల దాగు వ్యాఘ్రములు,
కానల పుట్టల దాగు నాగు లె
ట్టెట్టులు అంధకారమున
ఎన్ని అమాయిక ప్రాణులన్ భువిన్
పొట్టనబెట్టుకన్ మురిసి
పోవునొ కానవు నీవు భాస్కరా !

భుజగములె కాదు హరులు బెబ్బులులె కాదు
ముక్కు మొగములు లేని ఆ మూషికములు
కూడ ఓ సూర్యుడా నీవు చూడలేని
రాత్రు లందు విధ్వంసక రాజ్య మేలు.

కవియు కాననిచో కను రవి యటంచు
అందుకే నేను లోకకల్యాణ మతిని
వర మిడుచునుంటి ఓ ప్రభాకరుడ నీకు
సార్థక మ్మౌత నీ కర్మసాక్షి బిరుదు !

(1972)

# తెనుఁగు సాహితి

అరయ నవరస కావ్య మంజరులు విరిసి
మధురసుధ లొల్కు తీయని మధువు పారు
తెనుఁగు సారస్వతోద్యాన వనమునందు
హాయిగా విహరించి ధన్యాత్మ నౌదు.

అమృత శ్రుతులను మ్రోసెడి ఆంధ్రవీణ
కరకు హృదయాల పాలనా కాలమందు
మూగవడె తీగలను త్రెంచ మ్రోగలేక
తిరిగి శ్రుతి సాగె స్వాతంత్ర్య తరణి వెలుగ.

ఆరయ దివ్య కావ్య కుసు
మావళితోడ తెనుంగు సాహతీ
నీరజ పత్ర నేత్రను వి
నిర్మల ప్రేమ నలంకరించి, సం
స్కారమొనర్చి, నా తెనుఁగు
జాతికి ఖ్యాతిని గూర్చినట్టి మం
దారమువంటి పూర్వకవి
ధన్యుల కర్పణ సేతు జోహరుల్,

నవకవితాద్భుతాభ్యుదయ
నాదము మ్రోసి తెనుంగు జాతిలో
వివిధ కళా ప్రభాకరుల
వెల్గగజేసి; తెనుంగు సాహితీ

భువన మహాంగణమ్మున, న
పూర్వ వసంతము గూర్చినట్టి మా
నవ కవిచైత్ర మూర్తుల మ
నః పరిపూర్తి నమస్కరించెదన్.

తే. తెనుఁగు క్షేత్రాన చైతన్య దీపికలను
వెలుగజేసెడి సత్కళా ప్రియులకెపుడు
స్వాగతము పాడి, శాస్త్ర విజ్ఞాన నిధుల
తెనుఁగు వాణికి గైసేయ వినతి సేతు.

(చిన్ననాటి రచన 19-1-1952)

# ఆంధ్ర రాష్ట్రం

నలుబ దబ్దాల క్రితము స్వప్నాలు కన్న
బ్రతుకులెన్నియో పోరి స్వర్గమ్ముగన్న
ఆంధ్ర రాష్ట్రము నేటికి అవతరించె
త్యాగి మన పొట్టి శ్రీరాము డాహుతియవ.

నాడు తెనుంగు సీమ, రత
నాలు ఫలించి స్వతంత్ర లక్ష్మి తూ
గాడగ చూడలేక నర
కాసురు లాంగ్ల ప్రభుల్ కుబుద్ధితో
పాడిని వీడి చీల్చి పరి
పాలన చేయదలంచి చీల్చగన్
నేడు స్వతంత్ర భారతిని
నేర్పుగ నాంధ్ర పతాక లేపెడిన్.

సస్య సంభరిత ప్రజాస్వామ్యమై వెల్గు
కాకతీ సామ్రాజ్య ఘనత ఘనత
కవితా కుమారి ఘల్ ఘల్లున లాస్యమ్ము
సల్పిన ఆంధ్ర దేశంపు సొంపు
ఆత్మగౌరవ రక్షకై రక్తమోడ్చిన
పలనాటి వీరుల ప్రబల ప్రతిభ
నాకమ్ము తలపించునట్టి శ్రీరాయల
స్వర్ణయుగంపు ప్రశాంతి క్రాంతి

మగడి వెళ్గొందుగాక నిమ్మడిగ వడిగ
అవతరించిన ఈ సూతనాంధ్రరాష్ట్ర
తలము వాసంత శోభాన్వితమవుగాక !
ఈ తెలంగాణ త్వరితమందేకమయ్యె.

ఆంధ్ర ప్రజా ధ్వజం లేచె
అదిగదిగో తీవి పీచె
నడువు నడువు వడివడిగా
నవ శోభల్ వెలువడగా
ఆంధ్ర పతాకం క్రిందికి
మాతృ కరతలం క్రిందికి
తెలంగాణ సోదరా !
విశాలాంధ్ర మేర్పడన్
విడివిడిగా ఉండలేం____

ఆపంజాల డికెవ్వ డేనియు విశా
లాంధ్రం పునిర్మాణమున్
ఈపృధ్వే స్తుతియింపగా భరతమా
తృశ్రీయు దీపింపగా
స్థాపింతాము త్రికోటి తెన్గుల స్వభా
షా రాష్ట్రమున్ భాగ్య ము
ద్దీపింపన్ మనతోడి తమ్ములు నినా
దింపన్ స్వరాష్ట్రార్థమై.

స్వార్థ జన కువాదమ్ము నిష్ఫలము గాగ
ఆంధ్ర జనతా చిరాభిమతార్థమునకు

దీక్ష పట్టియు ఫలము సాధించినావు
ఆత్మబలి చేసి వీరమహాత్మ నీవు
అమర పొట్టి శ్రీరామ జోహారు లివిగొ !

లోక సుప్రసిద్ధామర వర మహాత్ములందునన్
నాకమందు మన ఘన దీక్షా తపస్వి ఆల్లదే
అధివసించినాడు సుసింహాసనమ్ముపైన ఆ
మధురమూర్తి దీవించును మనల ప్రగతికెప్పుడున్.

జయవిజయ నవాంధ్రరాష్ట్ర జయపతాక లక్ష్మికిన్
జయ స్వతంత్ర భరతమాత జయ ప్రపంచ శాంతికిన్
జయ స్వదేశ క్రాంతి శాంతి జయ యశస్వి రాముకున్
జయ మహాత్మగాంధికిన్ విజయ ప్రజాభిమతముకున్

(చిన్ననాటి రచన 10-10-1953)

# అశ్రుమాల

రమణీమణీ సుందరతర నాట్యాలతో
ఆలయమ్ముల సుమంత్రార్చనములు
కవిజనసామంత గణమంత్రి సహితుడై
రాయ లూరేగెడి రాజవీథి
మణి, ముక్త, కనకాంబర నవసూనాలతో
రాజిల్లు విపణ వీథీ జగత్తు
యువతీ యువకులు రే బవలు కళల పండ
శిలల నుండి చివుర్చు శిల్ప సృష్టి

సర్వ శోభిత సౌధ విశాల వీధు
లలరు ఆనాటి ఆంధ్ర విద్యానగరము
భావనయనాల మెరసె స్వప్నము విధాన
అడుగిడిన ఈ శిథిల సీమ ఎదదవాటి—

కవిరాజన్య సృజత్ సుకావ్యరస వృక్షశ్రీల గొంతెత్తి ఈ
భువనమ్ముల్ పులకింప, గాయక పికమ్ముల్ పాడ వాసంత ల
క్ష్మి వికాసింపగ, మల్లి నర్తన లుషఃశ్రీరేఖలన్ నింప మా
నవ చైత్రాంధ్ర సతీ వినిర్మిత కళానందాలయాల్ కూలెనా!

ఆపవే తుంగభద్ర బాలా! శిలాక
రాళ శైశిరఘాత హంపీలయోగ్ర
గాథ వినుచుట; ఆపవే కంటి ధార
లెద కరిగి పారు నా కళ్ళ నెట్లు సైతు—

సంగరమందు గెల్చిన నిశాటులమూకలు ఋష్యమూక మా
తంగ నగస్థ సౌధముల ధ్వంసముచేసి ఉషః కళార్ద్రశి
ల్పాంగన జీవలాస్య మధుహాసములన్ రగిలింప రక్తముల్
పొంగుచువచ్చి నిన్ కలిసి పోవగ నెట్లు భరించినా వాకో!

నిండు వెన్నెల అమమసనిశిని పూడి
పోయిన విధాన ఆంధ్ర ప్రపుల్లయశము;
రేపిన ప్రళయ ధూమాలరేయిలో, న
శించి పోయిన స్మృతికి చింతించు టేల!

బండలే గుండెలను విప్పి పరవశలయి
దాచుకొన్న 'జీవకళాసుధా పయోరు
సుందరతను' క్రోధాగ్నులయందు కాల్చి
మసిపులుముకొన్న నరరూపపసువు లెవరొ?

గతము గతమ్మెయైన, హతకమ్రశిలా కళయైన; ఆంధ్రరా
జతనయుడైన కన్నడ ప్రజాపతియైనను కృష్ణరాయ భూ
పతి; ఎద నల్ల గుండయిన - బంగరు పండి కళాస్థి నిండి శో
భిత మగు నాటి సీమను తలంచిన ఏ కను లశ్రులూరవే!

( చిన్ననాటి రచన - 1953 )

# కర్తవ్యం

ఎన్నడో పోయినట్టి కోయిల మనోజ్ఞ
గాన రసపూర్ణ వాసంత కథల నేడు
తలచి నిట్టూర్చి ఏడ్చి శోషిలెద వేల
గతము తలవంచు భావి నిర్మితము చేయ
కటి బిగింపక—

శ్రీలు చెలంగ సంస్కృతి హసింప సుఖించిననాటి ఆ అజం
తాలయ జీవమూర్తులకు ఆకటిమూటల నేటి కూటిబం
దీలకు గొప్ప అంతరము తెచ్చిన కాలము నుండి ఏమి పా
ఠాలు గ్రహించినావు; కపటాలు నశింప పథాలు వేయగన్.

ఎండిపోయిన డొక్కలు నిండుటెట్లొ
నిండి పోయిన చీకటుల్ చెండుటెట్లొ
స్వార్థ జనిత యుద్ధాగ్ని చల్లార్చుటెట్లొ
తెలిసికొన్నావ ? నడువు వెల్గులు హసింప.

కోతులు తాతలౌట మన కొంచెపు బుద్ధి నశింప లేదు, ఆ
శీతనగంపు మంచువలె చిట్టెము కట్టిన స్వార్థ మెన్నడీ
కోతి మనస్సునుండి తొలగున్ నరమానస సీమనెప్డు ప్రా
భాత సుధాకళల్ వెలయు భావికి జీవము వర్తమానమౌ !

( చిన్ననాటి రచన - 1953 )

# మెరుపులు

కాలిపోయెడి కారుమేఘాల చూచి
కాలరాత్రించరోగ్ర కంఠాలు ఏడ్చె
రాలి పడుచున్న కాంతి పుష్పాలు చూచి
మేలుకొనుచున్న సుప్తలోకాలు ఏడ్చె-

కామిని కనుల కామలోకాల గాంచి
ప్రేమికుడు తన్ను తాను శపించు కొనియె
ప్రేమమూర్తి గంభీర హృత్సీమ కాంచి
కాముకుడు తల వాల్చి వెన్కకు మరలియె.

బాలకుని నవ్వురాగాల పాట వినుచు
మాతృహృదయంబు మందార మధువు లూనె
మానవుని విశ్వశాంతి గీతాన తేలి
మానవతలోచనాల సంబరములూరె!

భయద జలధి సమాధి కన్పద స్రవంతి
బ్రతుకు తీరాన వెన్కకు పారచూచె
గరళ కంటక జీవ పంజరము వెడల
తప్తజీవి మిత్తికి దిడ్డితలుపు తీసె.

( చిన్ననాటి రచన - 1953 )

# అభివాదములు

కవుల నాదరించి కావ్యముద్రణలకు
వలయు సాయ మిడెడివారు అరుదు
నేటికాలమందు, నీ వంటివారు ఒ
యాసిసులు ఎడారులందు బావ !

లక్ష్మికల్గియు సాహిత్యలక్ష్మిపైన
గౌరవాదరణలు పెంచ గల్గినావు,
కర్మయోగివి సరస వాగ్ఝరివి నీవు
రాజగోపాలరెడ్డిబావా జయోస్తు !

మనపరస్పర రాగ నూతన సుమాలు;
మన చిరస్వప్నవాటి పండిన ఫలాలు;
మన్మనోమేఘ భావ శంపాచ్ఛటలు : మ
దీయ చైతన్యరేఖ లివే యశస్వి !

నాకు ధైర్యసంపద లిచ్చినావు నీవు
ఎంచలేని ప్రేమము కురిపించినావు
నేను నీకేమి అర్పింపలేను; సర్వ
దా కృతజ్ఞతాయుత మద్హృదయము తప్ప.

పుణ్యకార్యాల సాహితీ పోషణమ్ము
ఉత్తమము బావ ! నా మాట చిత్తగించి,
తరుల పోషించు నవవసంతము విధాన
కవుల పోషించు మిల కలకాల మీవు.

( నా తొలి గ్రంథము "చైతన్య రేఖలు" 1960 లో ఒక ఆత్మీయుడు వెలిగించినపుడు )

# చాటువులు

## రసతరంగాలు

నీ కనుచూపులందు దయ
నించి, స్మితార్ద్ర వచస్సులందు ఏ
వో కలకండ మాధురుల
నుంచి, ముఖాన పవిత్ర చిత్ర భా
వాకృతులన్ రచించుచు గృ
హాంగణ సీమను కాలు పెట్టగా
నే కలవోలె వచ్చి రమణీ! ఇడినా వల నాకు స్వాగతాల్.

*     *     *     *

నీ పిక వర్ణ చోళమును
నీ శుకఘోణ సదృక్ష చేలమున్
రూప విలాస రేఖలకు
రుక్ ముకురమ్ములు పట్టగా, కళా
క్షేప కరాంగుళాగ్రముల
కెంపు సితారను మీటి పాడు నీ
బాపురె బాపురే! కుసుమ
బాణుడు చూచిన మూర్ఛపోవడే!

*     *     *     *

రాలు కరంగు నప్స్వర శ్రీ
　　రమ్ములు వంగును కింకిణీ మృదం
గాల నటింతువేని, మధు
　　కావ్యగతమ్మగు తేనెలొల్కు నే
వేళ వచింతు వేని, గళ
　　వీణియ మోసిన సృష్టి పొంగు స
చ్ఛీలవు బాల! నిన్ విధి ర
　　చించెను సర్వకళా స్వరూపిగా!

* * * *

రసికుల గుండెపూల మక
　　రందము చిందగ, వారె దో వసం
త సుమ వనమ్ములో గల వి
　　ధమ్మనుభూతిని చెందునట్లు నీ
వసదృశ భంగిమమ్ముల మ
　　హా నటన మ్మొనరింతు, చంచలా
మసృణ సురేఖవో గిరి కు
　　మారివొ నీవు కుమారి ఎంచగన్.

* * * *

అరుణము నీ అధర మ్మది
అరుణము నీ ఫాల తిలక మరుణనఖమ్ముల్
అరుణము చూచుకములు మరి
అరుణిమె నీ కనుల కబ్బె, ఆగ్రహమేలా!

* * * *

దివ్య మౌ నీ అధరపాన దీక్ష నిచ్చి
పూర్ణమౌ నీ స్మితామ్నాయ బోధ నొసగి
అక్షయాలింగనా సౌఖ్య మోక్షమిమ్ము
అంజలి ఘటింతు నో మోహనాంగి నీకు.

*      *      *      *

చలి బాధ, అందులో నె
చ్చెలి లేని వియోగబాధ, శీతలమౌ వె
న్నెల బాధ, యౌవన తిమిం
గిల కోలాహలము బ్రతుకు గిజగిజ లాడెన్.

## ఆత్మీయుడు జె. యం. గ్రిగ్లాని

భగవద్భక్తి, కళానురక్తి చిర సౌ
భ్రాతృత్వ మైత్రీ సుధా
పగయౌ అభ్యుదయోన్ముఖాంగ్ల కవితా
వైతాళికుండైన మా
గ్రిగు లుండేమని చెప్పె ? ప్రేమరస వా
ర్ధిన్ తేలిరమ్మంచు జ్ఞా
న గవాక్షమ్మును విప్పి చెప్పె, గుణ వీ
ణాపాణియై వాణియై.

## కృతజ్ఞత

ఒక్కటే అంతరమ్ము దేవునికి నీకు
స్వప్న మాతడు కనిపించు సత్య మీవు
అందుకే నిన్ను దేవుడా యంచు పిలువ
భయపడుచునుంటి నీమీది భక్తికతన.

## స్వగతం

నేను కవీశ్వరుండ నన
నేరనుగాని రసార్ద్ర కావ్య ని
ర్మాణమె ప్రాణమైన సుకు
మారుడ, అక్షరభావ శిల్ప సం
ధానుడ నిత్య సత్య శుభ
దాయక జీవనగాన గర్భ సం
తానము నేను; నేను పరి
తప్త జగజ్జననీ ప్రసన్నుడన్.

* * * *

పుట్టినప్పుడు నేనేమొ పురజనుడను
పెరిగినాడను ఇన్నాళ్ళు హరిజనునిగ
గిరిజనుడనైతి జూబిలీ గిరులలోన
గూడుకట్టుక, యూసపుగూడ వదలి.

## జడివాన

మండుటెండల దాడికి గుండెలదరి
టిక్కెటులులేని మబ్బులు ట్రేనులెక్కి
వార్నిధులు నేలకు వలస వచ్చెనేమొ
వరదలెత్తెను వాగులు వంకలెల్ల.

## బాల బాలాజీ

రవుడివి నీవురా! కుటిల
రాక్షసులన్ తెగటార్చినట్టి మా
ధవుడివి నీవురా! నవ సు
ధారసమోహనరాగ పద్మ సం
భవుడివి నీవురా ఇలఝ
ఝంకర జీవన నాట్య గీతికా
శివుడివి మా నిరంతరము
చేసిన పుణ్య ఫలమ్ము నీవురా!

## భాష - భావం

భావము భాషపై తిరుగు
బాటొనరించు భాష యేమొ త
ద్భావములోన జీవము ర
వంతయు లేదని ఈసడించు, స్వా
భావికమైన రూపగుణ
బంధములన్ విడనాడి భాషయున్
భావము మృగ్యమై తెలుగు
వాఙ్మయ వీధులు తెల్లబోయెడిన్.

# మైత్రీబంధం

నీ మహౌదార్యమ్ము నీ వినమ్రతకు, హ
ర్షించియే నిన్ను ప్రేమించె లక్ష్మి;
నీలోని జిజ్ఞాస నీ రసజ్ఞతను గ్ర
హించియే నిను కటాక్షించె వాణి;
నీ సదాశయ కార్యనిరతులు మెచ్చియే
కోరి పదవులిచ్చినారు ప్రజలు
నీ సుహృద్భావ మైత్రీ సుధాస్నాతులై
పరవశిల్లెదరు నీ ప్రాణ సఖులు;

శారదకును, రమకు యశశ్శారదకును
ప్రేమ పాత్రుడవగు నీకు ప్రేమతోడ
నీకు నచ్చిన నా కవితా కుమారి
నిత్తు కొనుమయ్య, కె. యసు. దత్తువర్య!

(1964)

# సీతా వియోగి

తమ్ముడు లక్ష్మణుండు తన
దారను ఊర్మిళవీడి ఇన్ని వ
ర్షమ్ములు ఎట్లు జీవన భ
రమ్ములు నిల్పుకొనంగ జాలెనో!
నమ్మరుగాని ఒక్కొక క్ష
ణమ్ము ఫణమ్ము వ్రణమ్ము వోలె సీ
తమ్మకు నాకు దూరమయి
నప్పటినుండి వధించు నేలకో!

నా కారణముననే, బా
ధా కీలల నాదు తండ్రి దశరథు డీల్గెన్
నా కారణముననే కా
దా కంటికి నిద్రలేక తమ్ముడు కుమిలెన్.

ప్రాయములోనె లక్ష్మణుడు
ప్రాణసఖిన్ విడనాడి కంటక
ప్రాయ వియోగ జీవిత వి
భావరు లెట్లు సహించె నంచు నే
నేయెడ ఎంచకుంట, గడి
యేని అయోనిజ వీడకుంట అ
న్యాయము, న్యాయసమ్మతమె
నాకు వియోగపు శిక్ష వేయుటల్.

తానను భవించదేని అర్థమ్ము కావు
ఒరుల బాధలు బరువు లెవ్వరికి గాని
సానుభూతి లక్ష్మణు వియోగానుభూతి
కలదె సీతాపహరణమ్ము కలన గాక!

మేటి నరేంద్రు లంతకును
మేటి సురేంద్రులు అంతకంతకున్
మేటి నిశాచరేంద్రులును
మేదిని పుత్రిని నా కళత్రమున్
గోటను తాకినన్ తృటిని
కూలరె కాలరె; ఆమె రక్ష కే
నాటికి చింతలేమ ఇక
నా బ్రతుకెట్లను చింత ్రమగ్గెదన్.

నా కోదండము నా భుజాబలము క
న్నన్ జానకీ కోపిత
భ్రూ కోదండము పాతివ్రత్య బలముల్
పూర్ణమ్ములౌ మిన్నలౌ
నా కర్మమ్మన గాక ఆమె నెవరై
నా పట్టుకో సాధ్యమా
నా కోదండమునారియే విరహ వీ
ణా తంత్రు లై పోవునా!

తల్లి దండ్రులను పుత్ర వియోగమున ముంచి
సాగివచ్చితిని భూజానితోడ
భరత శత్రుఘ్నుల భ్రాతృ బంధము త్రెంచి
చేరవచ్చితిని కాంతారములకు

ఊర్మిళకు పతి వియోగ యోగము పెట్టి
కదలివచ్చితిని లక్ష్మణుని తోడ
నన్ను కన్నుల కద్దు కొన్న ప్రజల వీడి
తరలివచ్చితి రామగిరిగుహలకు

ఇందరిని నిండు ఎడబాటు ఏట్రదోసి
వచ్చితిని నేను ఘన ధర్మ వర్తి ననుచు
అందరి వియోగధునులు సమైక్య మై స
నీ విరహ సింధువున ముంచునేమొ ఏమొ !

మిత్రు నిజ భ్రాతృ మజ్జన
యిత్రి వియోగత్రయము సహించితి నెట్లో
చిత్రము నేడెందులకొ, క
ళత్ర వియోగముననే శిలానిభు నైతిన్.

"బావగారికి మా ఎడబాటులోని
బాధ తెలియును మా సీత బాసి కొంత
కాలముండిన" యని ఊర్మిలా లతాంగి
హాస్యమున కన్నదెదొ నిజమైనదేమొ!

అనెడి వియోగ యోగి సజ
లాంబుదగాత్రుని భగ్నరామ చం
ద్రుని గనినాను ఏమియును
తోచని చీకటిరేయిలో ఘనా
ఘన రవముల్ విలాపములు
కన్నుల మూతలు తీసివేసె నే
కనినది విన్నదేమి కల
కాదుగదా నిజ మేను చూచితిన్.

ఎవడు శపియించె ఊర్మిళాధవుని, జాన
కీ పతిని, అలనాడు యక్షప్రియునిని
ప్రణయజీవుల నెవ డెడబాపు నంచు
తలచి తలచి నే కనులెఱ్ఱ మలచినానొ!

( 1970 )

# వెలుగు–చీకటి

తెలవారగనె లేచి తొలిసంజ వెలుగుల
  నుతియించు క్రాంతి పక్షితతి రుతము
ఉన్నాడొ లేడొ దేవుడటంచు కొండల
  కోనల వెదకు నదీనదములు
నింగి నంటగబోయి నేలపై పడిపోయి
  మరిమరి యత్నించు మబ్బుగములు
అమ్లాన సత్య ఫుల్లాత్మలోయన వెల్గి
  మ్లానమైపోవు సుమాలతీరు

వేదవేదాంత సారము విప్పినట్లె
విప్పి, విప్పిన నా కనుల్ కప్పుచుండు
తెలిసినట్టులె తెలిసి నా తెలివి తెల్ల
వారుచుండును తామస ధారలౌచు.

(1980)

# బమ్మెర కోకిల

బమ్మెర కొమ్మపై తెలుగు
భాగవతామృత కోకిలమ్మపై
చిమ్మిన భక్తి భావరుచి
శీకర శ్రీకర హృద్య పద్య రా
గమ్ములు కూర్చె పంచశతి
కాలము కాశమువేయ ఆంధ్ర దే
శమ్మున కాంధ్ర సాహితికి
శాశ్వత హేమ వసంత శోభలన్ –

పలికినది భాగవత మని
పలికిన పలికితివి గాని పలికిన దెల్లన్
పలికినది మానవతమై
పలికిరి ముగురమ్మ లొక్క పలుకై నీవై –

సత్యాన్వేషణ నిత్య కృత్యముగ హిం
సా కంస విధ్వంసకున్
దైత్యారిన్ హరి నచ్యుతున్ కొలుచు టే
ధర్మముగా నెంచి, సౌ
హిత్య క్షీర సముద్రమున్ తరచి సా
హిత్యామృతం బిచ్చి స్వా
ర్థత్యాగ ప్రణవ ప్రబోధనధన
ప్రహ్లాది వైనా వహో!

తత్వ మసి కన్న మించిన
తత్వము వేరొకటి లేదు తత్వ జగన్నే
తృత్వము నీ సుకవిత్వ ర
సత్వము నెలకొల్పె పరవశత్వము తోడన్.

ఒక బక్క రైతువై ఒక మహారాజునే
 ధిక్కరించిన కళాధిపుడ వీవు
అందరి నోదార్చు అక్షర వాణినే
 ఓదార్చినట్టి భావుకుడ వీవు
హలమైన కలమైన అఖిల జనానంద
 సాధనమే నన్న సమత వీవు
భోగినీ భోగ ప్రబోధాత్మలో నుండి
 త్యాగివై మ్రోగిన యోగి వీవు

దారసుతులను సహజ సంసార పథము
బంధు మిత్రులు సాంఘిక బాధ్యతలను
వీడకయె మానవత్వము వీడకుండ
మనిషి దేవుడు ఒకటైన మహిమ వీవు.

కావ్యకన్యల కూళల కమ్మ రాద
టన్న నీవాక్కు లోక కల్యాణ ఋక్కు
కూటికోసము అమ్మరా దోటు హక్కు
అను ప్రజాస్వామ్య సందేశ మయ్యె నేడు.

చలివేంద్రమ్ము కళాత్మ తృష్ణకు సహ
 స్రస్తంభ రామప్ప శై
వల సంప్రోజ్వల శిల్ప కల్పనము; జీ
 వజ్జీవ దేహాత్మనై
ర్మల కేంద్రమ్ము త్వదీయ భావసుషమా
 రామమ్ము; తత్కాకతీ
యుల సామ్రాజ్యరమా విభూతికిని నీ
 ఉద్వాణికిణ మ్రొక్కెదణ.

( 1982 – ఓరుగల్లులో జరిగిన పోతన పంచశతి ఉత్సవాలలో.... )

# నా కవిత

కాళీయ ఫణి ఫణాగ్రము మీద, శ్రీపాద
నృత్యము నా లేఖినీ గమనము
అసురత్వ గర్భకుహర ఛేదనము చేయు
నఖతాండవమ్ము నా నవ కవనము
దుర్నీతి దశకంఠు దునుమాడ జృంభించు
జ్యా గర్జనమ్ము నా శబ్దరవళి
క్ష్మాతల ద్యోతలాక్రమణ చేసిన, బలి
వైరి పాదమ్ము నా భావ పరిధి

నవత, స్వచ్ఛందయువత మానవత సమత
హక్కులకు చెక్కు చెదరని అభయశక్తి
నా తపోజాత నిటలాక్ష జాతవేద
కీల సుస్నాత, నా సాహితీలలాంగి —

( 1983 )

# కళా కృష్ణ

నటరాజ గిరిజాభినయ కళా కైలాస
శృంగ ప్రసవన్నాట్య గంగ యతడు
కూచిపూడి కళామకుట నందనారామ
చకచకత్ శ్రీపారిజాత మతడు
కృష్ణలీలానంద కేళీవనాంతర
కుసుమిత మల్లికా కుంజ మతడు
తెలుగు శారద గళోద్దీప్తరాగములోన
పరవశించెడి భావ పద మతండు

శ్రోతలందరు ప్రేతలై చూచుచుండ
వేణుగాన విలోలుని, ప్రేమధనుని
తన వశము చేసుకున్న సత్యస్వరూపి
క్రీడన కలాపనా 'కళా కృష్ణు' డతడు

(1984)

# శ్రీనాథపీఠం

సీసాలలో కవితాసవమ్ములు నింపి
　　అందించితివి రసానందములుగ
శృంగారమును మేలి బంగారముగ మార్చి
　　పంచి పెట్టితివి నిష్పాక్షికముగ
ప్రతిభతో పాండిత్యపటిమతో గెలుచుకొ
　　న్నావు అక్షరభావనా వనులను
కలకంఠమై కాల కంఠుడవై మోసి
　　నావు ఓంకార శంఖారవమ్ము

నాడు శ్రీనాథ ! ఈ తెల్గునాడు లోన
శ్రీ సరస్వతి మంగళా వాస యోగ్య
మయ్యె మానేల నీ కవితార్చనమున
రమ్ము నీ జాతి ప్రగతి పీఠమ్ము పైకి.

(1985)

# ఎఱ్ఱయ

ఆరణ్యములో చిక్కిన
భారత ఖండమును తెలుగు భారతి మెచ్చన్
ధీరోద్ధతి కాపాడిన
వీరా ! ఎఱ్ఱయ్య ని క వేలాంజలిదే !

హరి వంశయశము వోలెనె
స్థిరమై నీ కీర్తి హృదయసీమలలోనన్
విరబూచి వెలుగుచుండును
హరినర భేదమ్ములేని అద్వైతముగా.

ఒంగోలు మండలము ఉ
ప్పొంగెను ఆ చదలువాడ పొలిమేరలలో
పొంగెను నీ అద్భుత రస
గంగలతో ఆత్మయోగ కళ్యాణముతో.

( 9–6–1985 నాడు ఒంగోలు లో జరిగిన ఎఱ్ఱయ ఉత్సవాలలో ఝుటితిస్ఫూర్తిగా చెప్పిన పద్యాలు )

# భజగోవిందం

(శ్రీ ఆదిశంకరాచార్యుల సంస్కృత మూలానికి అనువాదం)

భజనచేయుము గోవిందు భజన చేయు
మెపుడు మూఢమతీ! సమీపించునపుడు
చివరి కాలము నిన్ను, రక్షించలేవు
లేవు వ్యాకరణాల వల్లింపు లేవి -

వదలివేయుము విత్తసంపాదనాశ
స్వచ్ఛతమ బుద్ధితోడ ఆశారహితము
చేసికొని కష్ట ఫలముతో చేసి కొనుము
నీ మనస్సును ఆనంద ధామమెపుడు -

తరుణి కుచభార నత కటిస్థలము చూచి
ఎరవు కావద్దు మోహమత్సరత కీవు
మాంస వసరూప భేదము మాత్రమె అది
మరి మరి స్మరించు కొను మిది మనసు లోన -

జలజ పత్ర గతమ్మైన జలము వోలె
బ్రతుకు కడుచంచలమును తరళతరమ్ము
రోగములును మోహావేశ రోగములును
ఆవరించిన ఈలోక మంత శోక
తప్తమని తెలిసికొనుము -

శక్తి, విత్తమార్జించు ఆసక్తి కలిగి
నంతదాక భిమానింతు రాప్తు లెల్ల
కాని జవముడిగి బ్రతుకీడ్చు కాలమందు
ఇంటిలో పలుకరించరు ఎవరు నిన్ను -

తనువులో ప్రాణమున్నంత దాక ఇంట
అందరును క్షేమమా అని అడుగు వారె
శ్వాస ఈ దేహమును దాటి వేసె నేని
భార్యయును ఆ తనువు చూచి భయము చెందు -

అర్భకునిగ ఉన్నప్పుడు ఆటలందు
యువకునిగ నున్నయప్పుడు యువతులందు
బడుగుగా నున్నయపుడేమొ వగపులందు
కలిగియుందురు ఆసక్తి కాని ఎవరు
పడరు ఆసక్తి ఆ పరబ్రహ్మ మందు -

ఎవరు నీ భార్య, నీ పుత్రు డెవడు? ఎంత
చిత్రమైనదో సంసార జీవితమ్ము
ఎవరి వాడవు వచ్చినా వెచటి నుండి?
తత్వ మెరుగుము సోదరా! తలచి ఇపుడె -

సజ్జనులచెల్మి చేత నిస్సంగతయును
భువి నసంగత యందు నిర్మోహతయును
నిహత నిర్మోహతద్వార నిశ్చలతయు
పడయుదురు నిశ్చలతన జీవన విముక్తి -

వయసు మళ్ళినచో కామవాంఛ లేదు
నీరు ఇంకిన ఇంక కాసార మేది?
అడుగు వారేరి డబ్బంత ఉడిగె నేని
తత్వ మెరిగిన సంసార తపనమేది?-

వలదు గర్వము - ధనము, యౌవనము, జనము
కలవని; అవెల్ల మాయమౌ క్షణములోన
అరసి సర్వము మాయామయమ్మటంచు
బ్రహ్మ పదవర్తివగు మనుభవము పొంది -

రేయి పవలును, సంధ్యలు రెండు భువిని
శిశిర వాసంతములటు వచ్చి చనుచుండు
ఆడుకొనుచుండు కాలము, ఆరిపోవు
నాయు; నైనను వదల వాశానిలములు -

ఏల దారపై ధనముపై ఇంత చింత
నీకు ఓ వెర్రి! లేడా నిర్ణేత యొకడు;
త్రిజగముల భవజలధిలో తెప్పయౌచు
ఒప్పు సజ్జన సాంగత్య మొకటె సుమ్మి -
భజనచేయుము గోవిందు భజనచేయు
మెపుడు మూఢమతీ !......

( 1985 )